# చూడండి! సన్‌లైట్

## సగంబిళ్ల మాత్రమే ఈ బట్టలన్నిటిని ఉతికింది!



**అట్లు చేసినట్టిది దాని అధికమైన నురగ**

ఎంతో బాగుగా పనిచేయునట్టిది సన్‌లైట్ యొక్క అధికమైన నురగ, మీరు ఆశ్చర్యపడెదరు. సగం బిళ్లతోనే మీరు ఎన్ని బట్టలను ఉతికారో!

ప్రతి మురికి అణువును తొలగించివేయునట్టిదిన్ని — మీ బట్టలను అద్భుతమైన తెలుపుగాను, కాంతివంతముగాను చేయునట్టిదిన్ని. సన్‌లైట్ యొక్క అధికమైన నురగ!

మీరు బట్టలను బాదకుండానే శుభ్రపర్చునట్టిది సన్‌లైట్ యొక్క అధికమైన నురగ. అనగా మీ బట్టలు ఛాలాకాలము మన్నగలవు.




భారతదేశంలో
తయారుచేయబడినది

**సన్‌లైట్ సబ్బు బట్టలను తెల్లగాను కాంతివంతముగాను, ఉతుకును**

S. 243-X52 TL

సంవత్సర చందా
రు. 12-0-0
విడిపత్రిక 4 అ.



సచిత్రవారపత్రిక
Founder : K. NAGESWARA RAO

సంపుటము 51
సంచిక 33
17-4-57

హేవిళంబి చైత్ర బహుళ తృతీయ బుధవారం

# విషయానుక్రమణిక



ముఖచిత్రం : రాజశ్రీవారి "దాంపత్యం" లో జి. వరలక్ష్మి

# కేరళ

## 1957 మార్చి 5!

ఇది ఒక్క భారతదేశ చరిత్రలోనేగాక, ఆధునిక ప్రపంచ చరిత్రలో నే అతిప్రధానమైన రోజు. రాజ్యాంగబద్ధంగా, శాంతియుతంగా ఇటీవల జరిగిన ఎన్నికల ద్వారా, భారతసమాఖ్యకు చెందిన ఒక రాష్ట్రంలో పరిపాలనాధికారాన్ని కమ్యూనిస్టుపార్టీ హస్తగతం చేసుకున్న రోజు.

సుప్రసిద్ధ కమ్యూనిస్టు నాయకుడు శ్రీ శంకరన్ నంబూద్రిపాద్ ముఖ్యమంత్రిగా మరి పదిమంది సహచర మంత్రులుగా కేరళ రాష్ట్రంలో మంత్రివర్గం పదవీ స్వీకారం చేసిన రోజు.

దేశం స్వతంత్రమై పదేళ్ళయినా పూర్తిగా నిండకపూర్వమే ఒక రాష్ట్ర పరిపాలనాధికారాన్ని కమ్యూనిస్టులు చేజిక్కించుకోగలిగారు. దేశవ్యాప్తంగా అటు కేంద్రంలోనూ, ఇటు ఇతర రాష్ట్రాలలోనూ కాంగ్రెస్ ప్రభుత్వాలు ఏర్పాటవుతూంటే కేరళలోమాత్రం కమ్యూనిస్టు పరిపాలన ఏర్పడింది. ఇది అపూర్వమైన విషయం. కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వావతరణ ప్రభావం మిగతా రాష్ట్రాల రాజకీయ వ్యవహారాలమీద ఏవిధంగా పరిణమిస్తుందనే ప్రశ్న రావడం సహజం.

మనదేశంలో కమ్యూనిస్టుపార్టీ భవిష్యత్తు, ఇతర రాజకీయ పక్షాల భవిష్యత్తు కూడా కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వం సాధించే విజయాల మీద ఆధారపడి వుంటేమాట నిజం. కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వం లక్ష్య సాధనలో విఫలమైతే, ఇతరరాష్ట్రాలలో ఇప్పటికే క్షీణావస్థలో వున్న కమ్యూనిస్టుల స్థితి మరీ క్షీణించిపోయే మాటకూడా వాస్తవమే. కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వం జయప్రదంగా పనిచేయ గలిగినట్లయితే, వచ్చే ఎన్నికలనాటికి ఇతరరాష్ట్రాల్లో కూడా కమ్యూనిస్టులు తమబలాన్ని బాగాపుంజుకోవచ్చు. అక్కడకూడా కమ్యూనిస్టు ప్రభుత్వాలు ఏర్పాటు చేయగలిగిన స్థితికి వారు రావచ్చు. కాబట్టి ఇది కాంగ్రెస్‌కు ఒక సవాల్ అనే భావించాలి.

కేరళలో తమ పరిపాలనా వ్యవహారాల నిర్వహణ మీదే తమ పార్టీ భవిష్యత్తు ఆధారపడి వున్నదనే విషయం కమ్యూనిస్టులకు తెలియనిదికాదు. అందుచేత కేరళ రాష్ట్ర పరిపాలనను తగినంత జాగ్రత్తతోనే వారు నిర్వహించే మాట వాస్తవం. నూతన ముఖ్యమంత్రి. బాధ్యతలను స్వీకరించిన శ్రీ నంబూద్రిపాద్ భారత రాజ్యాంగానికి లోబడే వ్యవహరిస్తామని స్పష్టపరచడంలో ఇదే అంతరార్థం. రాజ్యాంగాన్ని అతిక్రమించి వ్యవహరిస్తారనిగాని, రాజ్యాంగాన్ని భగ్నం చేయడానికి ప్రయత్నిస్తారనిగాని సందేహించవలసినపనిలేదు.

అయితే ఒక విషయం మాత్రం మరిచిపోకూడదు. ప్రజలలో ఎక్కడ ఏ మాత్రం అసంతృప్తి ఏర్పడినా దాన్ని రాజకీయ ప్రయోజనాలకు ఉపయోగించుకోడానికీ, అశాంతిని రెచ్చగొట్టడానికీ, ప్రతి స్వల్ప విషయానికీ బ్రహ్మాండమైన ప్రచారం సాగించడానికీ అలవాటుపడ్డవారు కమ్యూనిస్టులు. రాష్ట్ర పరిపాలనాధికారం చేజిక్కినప్పటికీ, వారు ఈ తత్వాన్ని, నైజాన్ని మానగలరా అన్నదే ప్రశ్న.

హరిః ఓం అంటూనే కేరళ శాసనసభకు ఆంగ్లోఇండియన్ సభ్యుడి నామినేషన్ విషయంలో గవర్నర్‌తో పేచీ తెచ్చిపెట్టుకున్న కేరళ కమ్యూనిస్టు నాయకులు ముందు ముందు రాష్ట్ర గవర్నర్‌తో చీటికీ మాటికీ ఘర్షణకు దిగకుండా వుంటారా అన్నది మరొక ప్రశ్న.

రాజ్యాంగానికి విరుద్ధమేనని తెలిసి కూడా ప్రజా క్షేమానికి దోహదమివ్వవచ్చునన్న నమ్మకం కలిగించే రకరకాలశాసన నిర్మాణానికి కేరళ మంత్రివర్గం ప్రయత్నించవచ్చు. న్యాయస్థానాలుగాని, రాష్ట్రపతిగాని ఆ ప్రయత్నాన్ని కొనసాగనివ్వకపోతే, కేంద్ర ప్రభుత్వంమీద దుమ్ము తూర్పార పట్టవచ్చు. వీలైనప్పుడల్లా ప్రధాని నెహ్రూను ప్రశంసించవచ్చు; వీలుతప్పినప్పుడల్లా ఎదురుతిరిగి హేళనచేయవచ్చు. కాంగ్రెస్ మాజీమంత్రుల గోరంత, కొండంత పొరపాట్లను కంచుకాగడాలతో వెతికి పట్టుకోవచ్చు. వారిని అవమానపరచడానికి ప్రయత్నించవచ్చు. కేంద్ర ప్రభుత్వం సహాయం చేయలేదని తెలిసికూడా పెద్ద పెద్ద ప్రాజెక్టులను అమలుజరపదలచినట్లు ప్రకటించి కోట్లకొద్దీ రుణ సహాయాన్ని అభ్యర్థించవచ్చు. ఇవ్వకపోతే, తప్పు అంతా కేంద్రానిదేనని ప్రచారంచేసి వోటర్లకు సమాధానం చెప్పుకోవచ్చు.

వీటన్నిటితోపాటు తమ జీతాలను తగ్గించుకొని నిరాడంబరంగా జీవిస్తూ పోలీసు, పబ్లిక్ వర్క్సు శాఖలను వెయ్యి కళ్ళతో కనిపెట్టి వ్యవహరించవచ్చు. అవినీతి నిర్మూలనకు ప్రయత్నించవచ్చు. కేరళరాష్ట్రం దేశంలోని మిగతా రాష్ట్రాలలాంటిదికాదు. అక్కడ విద్యావంతుల సంఖ్య అత్యధికం. నూటికి 70 వంతులు వుంటుంది. అందుకే నిరుద్యోగం కూడా ఎక్కువ. నిరుద్యోగ నిర్మూలన మన్నది అక్కడ అతి క్లిష్ట సమస్య. లోటు రాష్ట్రమైనందువల్ల తగినంత ఆహారం సప్లయి చేయడం మరొక జటిల సమస్య. ఈ సమస్యలన్నిటినీ కమ్యూనిస్టు ప్రభుత్వం ఏ విధంగా ఎదుర్కొంటుందో, పరిష్కరిస్తుందో, ఎంత వరకు సర్వ ప్రజారంజకమైన పరిపాలనను నిర్వహిస్తుందో చూడాలి.

ఏది ఏమైనప్పటికీ, ఇతర రాష్ట్రాలలోని కాంగ్రెస్ ప్రభుత్వాలకు పక్కలో బల్లెంగా వుండి వాటిని నిరంతర జాగ్రదవస్థలో వుంచడానికి కేరళ ప్రభుత్వం సహాయపడే మాట వాస్తవం. ★

# గోవాలో పోర్చుగీసు దురాగతాలు

శ్రీ కృష్ణ

[ఆంధ్రపత్రిక న్యూఢిల్లీ ప్రతినిధి]

గోవాలో పోర్చుగీసు పరిపాలన నగ్న స్వరూపాన్ని బయటపెడుతూ శ్రీ జె. ఫ్రాన్సిస్ అనే ఆయన లండన్ "టైమ్స్ లిటరరీ సప్లిమెంట్" 15 ఫిబ్రవరి 1957 సంచికలో ఒక లేఖ వ్రాశారు:

"కర్నల్ రెమీ రచించిన 'గోవా-ప్రాచ్యఖండపు రోమ్' అనే గ్రంథాన్ని సమీక్షిస్తూ 'కర్నల్ రెమీ పూర్వకాలపు పోర్చుగీసు విజయాలలో ప్రస్తుత యథార్థాలను పోల్చుతూ వ్రాశారు' అని మీ సమీక్షకుడు అన్నారు. సమీక్ష చదివితే, పూర్వకాలంలోని పోర్చుగీసు ఘన విజయాలను కర్నల్ రెమీ చిత్రించిన పద్ధతిని మీ సమీక్షకుడు ఆమోదించినట్లే కనిపిస్తున్నది. కర్నల్ రెమీ పుస్తకంలో మూడింట రెండువంతులదాకా పోర్చుగీసుల ఘన విజయాల ప్రశంస తప్ప మరేం లేదు.

వాస్కోడగామా, ఆల్బ్యుకర్క్ మొదలైన పోర్చుగీసు 'మహావీరుల' సాహసాలను గూర్చి పోర్చుగీసు చరిత్రకారులు కూడా వ్రాయనంత అద్భుతంగా కర్నల్ రెమీ వ్రాసేశారు. కాని పోర్చుగీసువారిమీద ద్వేషమేమీ లేని ఇంగ్లీషు చరిత్రకారుడు ఎఫ్. సి. డాన్వర్స్ ఏం వ్రాశాడో చూడండి:

'ప్రాచ్యఖండంలో పోర్చుగీసువారిపై అరబ్బులు, భారతీయులు శత్రుత్వం వహించడానికి ఒక ముఖ్యకారణం ఉన్నది. కొన్ని శతాబ్దాలనుంచీ పోర్చుగీసువారు వర్తక వాణిజ్యాలపై సంపూర్ణాధికారం చెలాయిస్తూ విపరీత లాభాలు సంపాదించారు. ఆ వర్తక వాణిజ్యాలను తిరిగి స్వాధీన పరచుకోవాలనేది ఈ శత్రుత్వానికి ముఖ్య కారణం. తమ పరిపాలనపై కత్తిగట్టినవారిని పోర్చుగీసువారు నిర్దాక్షిణ్యంగా, అమానుషంగా హింసించడం ఈశత్రుత్వాన్ని మరింత అధికంచేసి, పోర్చుగీసువారి నెలాగైనా తరిమి వెయ్యాలనే ఉద్యమానికి దారితీసింది. నిస్సహాయంగాఉన్న పట్టణాలను ధ్వంసం చేయడం, తమ ప్రతికూలురను విచక్షణ లేకుండా హత్యచేయడం, నాగరికులమని చెప్పుకుంటూ సముద్రాలమీద బందిపోటు దొంగతనాలు చేయడం మొదలైన పోర్చుగీసు దురాగతాల మూలంగా, వారి పరిపాలనకు తీవ్రమైన ప్రాతికూల్యం, ప్రతిక్రియాభిలాష అధికమైనాయి.'

కర్నల్ రెమీ ప్రశంసించిన గోవా కాథలిక్ మతాన్ని, కాథలిక్ మత నేరవిచారణను గూర్చి డాన్వర్స్ ఏం వ్రాశారో చూడండి:

'బలాత్కారంగా ప్రజలకు కాథలిక్ మతం ఇప్పించడానికై, పోర్చుగీసువారు మొదటినుంచీ క్రూరపద్ధతులను అనుసరించుతూనే ఉన్నారు. స్వదేశీయుల దేవాలయాలను ధ్వంసంచేసేశారు. కత్తులూ, తుపాకులూ పట్టుకుని, అంతకు ముందు భారతదేశంలో మహమ్మదీయులు చేసినట్లే, క్రైస్తవమత ప్రచారం చేసేవారు.'

కర్నల్ రెమీ వ్రాసిన విచిత్ర చరిత్రను చూసి నిష్పాక్షికంగా ఆలోచించేవారెవరైనా, ఆయన వ్రాసినవి ఎంతవరకూ యథార్థాలు అని సంశయించక మానరు.

అసలు కర్నల్ రెమీ ఇంటర్వ్యూ చేసిన గోవన్ ఖైదీలు ఎవరూ అని నా ప్రశ్న! అతగాడు దాద్రా, నాగర్‌హవేలీలకు ఎప్పుడూ వెళ్ళలేదుగదా అక్కడి 'యథార్థ విషయా'లన్నీ ఆయన కెలా తెలిశాయి అని మరో సందేహం.

పోర్చుగీసు వలసపరిపాలనను సమర్థించడానికి కర్నల్ రెమీ చాలా తంటాలు పడ్డారు. 1951 జూలై 11 న పోర్చుగీసు రాజ్యాంగం సవరింపబడినప్పటినుంచే కాక, మొదటినుంచీ గోవా 'పోర్చుగీసు రాష్ట్రమే' అనే బుకాయింపును సమర్థించడానికి, పోర్చుగీసు ప్రభుత్వం ఎప్పుడో 1612 లో చేసిన ఒక ప్రకటనను ఆయన ఉదహరించారు. పోర్చుగీసు ప్రభుత్వం అప్పుడు ఆ ప్రకటన చేసినప్పటికీ, గోవాను అప్పటికీ ఇప్పటికీ తన 'వలస' గానే భావిస్తోందనీ, డా॥ సాలాజార్ తనంతటతనే ఈ విషయాన్ని ఒప్పుకుని తనసామ్రాజ్యంలో 'నేటివ్స్' ఉన్నారని అన్నాడనీ కర్నల్ రెమీ మరచిపోయారు. డా॥ సాలాజార్ ప్రకటనలు చూస్తే, పోర్చుగీసు రాజ్యాంగ శాసనాలు ఎంత అర్థరహితమైనవో తెలుస్తుంది.'

పైన ఉదహరించిన లేఖ, టైమ్స్ లిటరరీ సప్లిమెంట్‌లో కర్నల్ రెమీ గ్రంథంపై ప్రచురింపబడిన సమీక్షకు సమాధానం. ఆ గ్రంథంనిండా పోర్చుగీసువారికి అనుకూలమైన ప్రచారం తప్ప మరేమీ లేదు. ఆ పుస్తకం "అద్భుతం"గా ఉందని 'టైమ్స్' సమీక్షకుడు అభిప్రాయపడ్డాడు. దీన్ని ఖండిస్తూ శ్రీ ఫ్రాన్సిస్ పై లేఖ వ్రాశాడు.





# పరమ శివార్చన

గత సంచిక తరువాయి

౪

శూరమంత్రి పినాకధన్వ చేసిన చౌర్యం ఆమూలాగ్రంగా అవగాహన చేసుకోవాలని నిశ్చయించి వేగులవారిని కొందరిని పిలిపించి అతి రహస్యంగా ఆ వ్యవహారం అంతా గాలించవలసిందని ఆజ్ఞాపించాడు.

మంత్రి అనుక్షణము వెయ్యి కళ్ళతో కాశ్మీర రాజ్య వ్యవహారాలన్నీ పరిశీలిస్తూనే ఉంటాడు. అయినా తన కుమారుడే చౌర్యం చేసినా అతనికది లవలేశమైనా తెలియలేదు. దాని కతడెంతో నొచ్చుకున్నాడు. భార్యకావిషయ మేమైనా కొంచెం లోతుగా తెలిసి ఉండవచ్చునని ఆమెనడిగి చూచాడు.

జయమంగళ తనకా విషయం అంతకంటె తెలియదనీ, ధన్వ తన దంతపేటికలో ఆ పచ్చలహారం అతిరహస్యంగా దాచివేస్తూంటే చూచి పట్టుకొని వెంటనే అది భూతేశ్వరస్వామి ఆలయ ధర్మాధికారికి పంపించివేశాననీ చెప్పింది. అంతకు మించి తానా విషయం ఏమీ ఎరగనని కంట నీరు పెట్టుకుంది.

మంత్రికి జయమంగళ చెప్పినది నమ్మక తప్పలేదు! ఎంతటి రహస్య విషయమైనా ఆమె కతనిదగ్గర ఆ రహస్యం దాచే అలవాటు లేదు! అసలే ఆమె కుమారుడిల్లు విడిచి వెళ్ళిపోయాడని బెంగటిల్లి కుమిలి కృశించిపోతూంది. ఆ పరిస్థితులలో ఆమె నికనొప్పించడం వల్ల ప్రయోజనమేమీ లేదని మంత్రి మరి ఆ సంగతి ఆమెతో ప్రస్తావించలేదు.

ఆపైన నయానా భయానా బుజ్జగించి ఆ విషయం ధన్వనడిగి తెలుసుకోవాలని అనుకున్నాడు. కాని అతడు మళ్ళీ తిరిగి భవంతికే రాలేదు!

మంత్రి నొక్క అనుమానం గట్టిగా పట్టుకుని పీడించింది. భూతేశ్వరస్వామి ఆలయంలో అమ్మవారి ముక్కెర కాజేసిన బందిపోటు దొంగ దొంగతనానికీ, ధన్వచేసిన దొంగతనానికీ ఏదో గట్టి సంబంధం ఉండి తీరాలని అతని అనుమానం! ఆ బందిపోటు దొంగ ముక్కెర అపహరించాడు. ధన్వ పచ్చలహారం అపహరించాడు. రెండు భూతేశ్వరస్వామి ఆలయంలో, త్రాపీ అమ్మవారి ఆలయంలో జరిగిన చౌర్యాలే!

అయితే ముక్కెర అపహరించిన దొంగ కతడప్పుడే దారుణ మరణశిక్ష విధించివేశాడు. అతని మూలంగా ఇక ఆ రహస్యం భేదించే ఆస్కారమేమీ లేదు. మంత్రి కెలాగైనా ఆ రహస్యం భేదించి తీరాలని గట్టిపట్టుదల కలిగింది.

వెనువెంటనే భూతేశ్వరాలయ ధర్మాధికారి కంచెలమీద కబురుపెట్టాడు. మంత్రి పిలిపించారన్న మాట వినగానే ఆలయ ధర్మాధికారి రెక్కలు కట్టుకొని ఆయన భవంతిలో వాలిపోయాడు. మంత్రిని చూస్తూనే అతడు సవినయంగా దోసిలిఒగ్గి నిలుచున్నాడు. శూర మంత్రి గుక్క తిప్పుకోకుండా అతని మీద ప్రశ్నలవర్షం కురిపించాడు.



"అమ్మవారి ఆలయంలో జరిగిన దొంగతనంలో ఏయే ఆభరణాలు పోయాయి?"

"ముక్కెర, పచ్చలహారం, రత్నాంగుళీయకం."

రత్నాంగుళీయకం కూడా దొంగలపహరించిన విషయం మంత్రి కంతవరకు తెలియనే లేదు. అతడు లోలోపల నిర్ఘాంతపడినా పైపైకదేమీ కనబడనీయలేదు:

"ఆ అంగుళీయకం విషయం నాకింతవరకు తెలియనేలేదే?"

"ఈ స్వల్ప విషయానికి తమ దాకా ఎందుకని నగర దండనాయకుల కది తెలుపుడు చేసుకున్నాము."

"అంగుళీయకం అపహరించిన వారెవరు?"

"ఇంకా అది దొరకనేలేదు!"

"ఈ మూడు చౌర్యాలు ఎంత వ్యవధిలో జరిగాయి?"

"ఒక్క నాటి రాత్రే!"

"బందిపోటు దొంగలెంత మంది వచ్చారు?"

"నలుగురైదుగురు వచ్చారట!"

"అందరు దొరికారా?"

"లేదు!"

"ఎంతమంది దొరికారు!"

"ఈ విషయంలో తమకు తెలియనిదేముంది? ఇంతవరకు—ఒక్క దొంగ మాత్రమే పట్టుబడ్డాడు! అతనికి తామే మరణదండన విధించారు!".

ఆ వ్యంగ్య సమాధానం శూరమంత్రి గుండెల్లో సూటిగా పొడుచుకుంది. అయినా అతడది అణువంతైనా పైకి వ్యక్తం కానీయలేదు. అటుపిమ్మట మంత్రి ధర్మాధికారి నేవేవో రెండు మూడు చిన్న విషయాలడిగి ఆ పరిశీలన అంతటితో ముగించివేశాడు. వెంటనే ధర్మాధికారి తిరిగి వెళ్ళిపోయాడు.

అంతటితో శూరమంత్రికి కుమారునికా దొంగతనంలో పాలున్నదనిగట్టి అనుమానం కలిగింది. ఇక అతనినెలాగైనా నెమ్మదిగా బుజ్జగించి ఆ విషయం లోతుపాతులన్నీ క్షుణ్ణంగా తెలుసుకునితీరాలని నిశ్చయించుకొన్నాడు.

పినాకధన్వను చిన్నప్పటినించీ ఎత్తుకొని లాలించి పెంచిన ఒక దాదిని పిలిచి ధన్వనెలాగైనా వెతికి పట్టుకుని నెమ్మదిగా బుజ్జగించి ఇంటికి తీసుకురావలిసిందని ఆజ్ఞాపించాడు.

సామాన్యంగా దత్తపుత్రులకు కొన్ని అవగుణాలలవడుతూంటాయి. ధన్వకా గుణాలు మరింత బాగా అలవడ్డాయి. చిన్నప్పటినించీ జయమంగళ అతని నెంతో గారాబంగా పెంచి పెద్దవాణ్ణి చేసింది. ఆ గారాబంవల్ల శూరమంత్రి కతనిని బాగా అదుపులో పెట్టవలసిన ఆవశ్యకత ఏర్పడింది. దానాదీనా పినాకధన్వకు చిన్నప్పటినించీ ఆకతాయితనము, మంకుపట్టు మొదలైన అవగుణాలన్నీ బాగా అలవడ్డాయి. ఆపైన ధన్వ తలిదండ్రులు చాలా సామాన్య సంసారులు. నాలుగైదేళ్ళ వయస్సు వచ్చేవరకు అతడా పరిస్థితులలోనే పెరిగాడు. అటుపిమ్మట శూరమంత్రిభవంతిలో అతనికి మహారాజభోగాలలవడ్డాయి. జయమంగళ అత

పి. గణపతిశాస్త్రి



ఏది అడిగినా తండ్రికైనా తెలియకుండా చాటుమాటుగా అతనికి అందిచ్చి అల్లారు ముద్దుగా పెంచి పెద్దవాణ్ణి చేసింది. ధన్వ చిన్నతనంలో ఒకమారు తనకొక పెద్దఏనుగు, జరీ అంబారీ కావాలని మంకుపట్టుపట్టాడు. ఆ రోజుల్లో అది మహాభోగు లుపయోగించే అత్యుత్తమ వాహనం! అయినా దానికామె వెనకాడలేదు! ఆ విషయం భర్తతోనైనా సంప్రతించకుండా ఆ మరునాడే కుమారుని ముచ్చట తీర్చింది. అది తెలిసి మంత్రి ఆమె మీద విసుక్కున్నాడు. గురుకులవాసం చేసి చక్కగా శాస్త్రాభ్యాసం చెయ్యవలసిన వయస్సులో అటువంటి వినోద విహారాలు పనికిరావని కసరుస లాడాడు. కాని ఆమె మాట కెదురాడలేక ఆ విషయం చూసీచూడ నట్టు మాట్లాడక ఊరుకున్నాడు. ఆవిధంగా పెరిగి పెద్దవాడైన ధన్వ అతనికొక హృదయ వ్యాధిగా పరిణమించడంలో ఆశ్చర్యం ఏమి ఉంది?

పినాకధన్వను వెదకడానికి వెళ్ళిన దాది కతని అనుపానులన్నీ బాగా తెలుసును. అందుచేత అనాటిరాత్రికే నెమ్మదిగా అతని నింటికి తీసుకువచ్చింది. కుమారుని చూడగానే జయమంగళకు ప్రాణం లేచివచ్చింది. కూరమంత్రికూడా అతనినేమీ అనలేదు! భర్తధోరణిచూచి జయమంగళ బాగాఆశ్చర్య పడింది. కాని ఆయన ఔదాసీన్యంలో ఏదో అంతరార్థం ఉన్నదని ఆమె ఒక్క క్షణంలో పసిగట్టివేసింది. తండ్రి వాత్సల్యం ధన్వకు మరింత ఆశ్చర్యం కలిగించింది.

ఆ మరునాడు మంత్రి పినాకధన్వ నెంతో ఆప్యాయంగా తనదగ్గరికి పిలిచి ఆ రత్నాంగుళీయక మేమైనదో చెప్పవలసిం దని బతిమాలుకున్నాడు. అది అపహరించడం కేవలం విషసర్పంతో చెలగాటమని హెచ్చరించాడు. జరిగిన సంగతి అంతా యథాతథంగా చెప్పివేస్తే మహారాజది అతని ప్రథమ తప్పిదంగా క్షమించి విడిచిపెట్టగల రనీ ఆ విషయం అంతా యథాతథంగా తెలియజేయమనీ పరిపరివిధాల బుజ్జగించి బతిమాలుకున్నాడు.

ఆ అనునయంతో పినాకధన్వకు తండ్రి

# ★ పరమశివార్చన ★

ఔదాసీన్యాని కంతరార్థం అంతా స్పష్టంగా తెలిసిపోయింది. ధన్వ కప్పటికి ఊరికే వట్టి పుణ్యానికి అబద్ధాలాడడం ఒక పరిపాటిగా అలవాటయింది. ఎవరేనా ప్రశంగవశాత్తు 'భోజనం అయిందా' అని ప్రశ్నిస్తే భోజనం చేసినా అతడు తడుముకోకుండా చెయ్యనే లేదనే చెప్పివేస్తాడు. జయమంగళ తప్ప అందరు తన ననుమానిస్తున్నారనే అతని భయం!

అయినా అతడా భయమేమీ పైకి కనబడనీయకుండా నెమ్మదిగా తన చౌర్య కథ అంతా తండ్రికి తెలియజేశాడు. నలుగురు బందిపోటు దొంగలతో కలిసి తాను భూతేశ్వరస్వామి ఆలయం దోచుకున్న మాట నిజమే అని అంగీకరించాడు. పోయిన నగలలో పచ్చలహారం తాను చేజిక్కించుకొన్నానని ఒప్పుకొన్నాడు. మిగిలిన నలుగురిలోను ఒకడు ముక్కెర, మరి ఒకడు రత్నాంగుళీయకము, అపహరించారనీ వారిలో ముక్కెర అపహరించినవాడే మరణదండన అనుభవించాడనీ రత్నాంగుళీయకం అపహరించినదొంగ మిగిలిన ఇద్దరితోను కలిసి ఆ రాత్రే శ్రీనగర పరిసర పర్వత గుహలలోకి పారిపోయాడనీ చెప్పాడు. ఆపైన వారి సంగతి తనకేమీ తెలియ లేదని అన్నాడు.

మంత్రి అతనినెన్నో విధాలుగా ఆ విషయాలన్నీ గుచ్చి గుచ్చి అడిగాడు. ధన్వ ఆ దొంగల పేరులు, వారితో తన కేర్పడిన సంబంధము మొదలైన విషయాలన్నీ పూసగుచ్చినట్లేకరువు పెట్టాడు.

మంత్రి కతనిమాటలు వింటూంటే అవన్నీ యథార్థాలే అయి ఉండవచ్చునని నమ్మకం కలిగింది. అయితే ధన్వ ఏదో కొంచెం మెలత వేస్తున్నాడని కూడా అనిపించక పోలేదు. ఎంత ప్రయత్నించినా ఆ మెలత ఏదో అతనికి బోధపడలేదు. క్రమక్రమంగా అదే బోధపడి తీరుతుందనీ అప్పుడిక ధన్వను బెదిరించడంవల్ల ప్రయోజన మేమీ లేదనీ నిశ్చయించి, మంత్రి ఆ ప్రస్తావన అంతటితో ముగించివేశాడు.

ఇక అటువంటి దుస్సాహసాలు చెయ్యవద్దని ధన్వ కనేక విధాల హితబోధ చేశాడు. ధన్వ తనఅపరాధం మన్నించవలసినదనీ ఇంకెప్పుడు అటువంటి సాహసాలు చెయ్యననీ నలుగురిలోను తనకప్రతిష్ఠ రాకుండా రక్షించవలసిందనీ ప్రార్థించాడు. మంత్రి అతని ప్రార్థన విని ఒక్క వేడినిట్టూర్పు విడిచి పెట్టాడు.

పినాకధన్వ చెప్పిన విషయాలన్నీ విని మంత్రి చాలాసేపటివరకు ఏదో లోతుగా ఆలోచిస్తూ కూర్చున్నాడు. మరి కొంతసేపటికా దీర్ఘాలోచన ముగించాడు. ఆ మిగిలిన ముగ్గురు బందిపోటు దొంగలను వెంటనే వెదికి పట్టుకోవలసిందని శ్రీనగర దండనాయకుని కొక శ్రీముఖం పంపించాడు. శ్రీనగర పరిసరారణ్యాలలోని కొండలు, గుహలు, గుట్టలు అన్నీ గాలించి తీరవలసిందని ఆ శ్రీముఖంలో ప్రత్యేకంగా ఉట్టంకించాడు.

ఆ క్షణంనించీ అతని హృదయంలో ఒక పెద్ద కొండ మోపినట్టయింది. అతడనేక విధాలుగా మథనపడ్డాడు.

నేడో రేపో ఆ దొంగలు ముగ్గురు దొరికి తీరతారు. అప్పుడు వారి చౌర్యాలతో బాటు పినాకధన్వచేసిన చౌర్యం కూడా అందరికీ తెలిసితీరుతుంది. ఆ దొంగలను ముగ్గురినీ గట్టిగా నిర్బంధించి అడిగినప్పుడు వారు తమకు, పినాకధన్వకు మధ్యన నడిచిన వ్యవహారం అంతా నలుగురిఎదట వెల్లడించక మానరు. అప్పుడిక తానందరిలోను తల ఎత్తుకుని తిరగగలడా? పినాకధన్వ అపహరించిన పచ్చలహారం తిరిగి దేవాలయ ధర్మాధికారికి పంపించివెయ్యడం వల్ల అతనికి దారుణ మరణశిక్ష తప్పితే తప్పిపోవచ్చును! కాని అతని మూలకంగా తనకు వచ్చే అప్రతిష్ఠ మాట! తానిక ఏముఖం పెట్టుకొని మహారాజు సమక్షంలో నిలబడగలడు? ఇప్పుడిక తన కర్తవ్యమేమిటి?

ఆవిధంగా అతని మథన ఎంతసేపటికీ ఎటు తెగలేదు. ఆ విషయంలో కాశ్మీరాస్థాన విద్వత్కవి శివస్వామి నొకమారు సందర్శింపవలెనని అనుకొన్నాడు. వెంటనే శివస్వామి భవంతి కొక ఆందోళిక పంపించాడు. ఎలాగైనా ఒకమారు దర్శన మిప్పించవలసిందని శివస్వామికి కబురు పంపించాడు. శివస్వామి రాగానే అతనితో కలిసి తన రహస్య మంత్రాగారం లోనికి వెళ్ళిపోయాడు.

శివస్వామి శూరమంత్రి కత్యంతాప్తుడు. నిత్యశివపూజా ధురంధరుడు. మంత్రి అప్పుడతనితో కలిసి ఇష్టాగోష్ఠి ప్రసంగాలు జరుపుతూంటాడు. కుశలప్రశ్నాదికం జరిగిన పిమ్మట మంత్రి తన మనస్సులోని మాట అతని ఎదట బయలు పెట్టాడు:

"నేనీ మహాశివరాత్రి వెళ్ళగానే వారణాసికి వెళ్ళిపోయి, ఇక ఈ జీవిత శేషం అంతా అక్కడే గడిపివేద్దామని అనుకుంటున్నాను."

శివస్వామి ఆ మాట విని నిశ్చలదృష్టితో మంత్రి ముఖం పరిశీలించాడు:

"ఇప్పుడింతటి తొందర ఏమివచ్చింది?"

"నాకు క్రమంగా శరీరపాటవం తప్పిపోతూంది. ఇటీవల మా ధన్వమూలాన కొంత మనస్స్థిమితం కూడా చెడింది. నాకీ రాజ్యకార్య వ్యాసంగం వల్ల నిత్యము నిర్వర్తించుకునే పరమశివార్చనకు కూడా వ్యవధి దొరకడం లేదు."

శివస్వామి అది విని కొంచెం హేళగా నవ్వి కర్పూర తాంబూలచర్వణం ప్రారంభించాడు:

"మీ వంటి వారే ఇలాగంటే నేనేమనను! రాజకార్యవ్యాసంగంలో మీరనుక్షణము చేస్తున్నది పరమేశ్వరార్చనమే! ఈ వయస్సులో దీని కోసం ప్రత్యేకంగా వారణాసికి వెళ్ళవలసినంత అవసరం ఏమి వచ్చింది!"

శూరమంత్రి కతని మాటలలోని అంతరార్థం విస్పష్టంగా అవగాహన కాలేదు. బొమముడి విరిచి జిజ్ఞాసా దృష్టితో శివస్వామి వైపు చూచాడు.

శివస్వామి తిరిగీ హేళగా నవ్వాడు:

"మహామంత్రీ! ఈ కాశ్మీరధరణి సాక్షాత్తు పరమశివుని అర్ధాంగి అనీ కాశ్మీరాధీశ్వరులు కేవలం పరమశివాంశస్వరూపులనీ మన పురాణ వేత్తలుద్ఘోషిస్తున్నారు. తత్రాపి మన అవంతి వర్మాధీశ్వరులు సాక్షాత్తు ఆర్షధర్మ స్వరూపులే! ఆ ఆర్షధర్మ నిర్వహణలో మీరనుక్షణము పరమ శివార్చన చేస్తూనే ఉన్నారు. మీ చల్లని పరిపాలనలో కాశ్మీర ప్రజ హాయిగా గుండెల మీద చేతులు వేసుకొని నిద్రపోతున్నారు. మీ మూలంగా ఆర్షధర్మదేవత కాశ్మీరంలో అంతటా నాలుగు పాదాలతోను యథేచ్ఛగా విహరిస్తున్నది. ఇంతకన్నా వేరే పరమశివార్చన ఏమి ఉంది! మీకుమాత్రం ఈ విషయం తెలియదు గనకనా?"

శివస్వామి ముత్యాలచూర్ణంతో మెదిపిన కర్పూరతాంబూలం పుక్కిట బెట్టి మళ్లీ ఒక చిరునవ్వు నవ్వు చిందించాడు. ఆ చిరునవ్వతని చెక్కిళ్లపై రత్నకుండనాల వరకు విస్తరించింది.

మంత్రికతని ధర్మస్వరూప వివరణతో హఠాత్తుగా ఒక కనువిప్పు కలిగింది. ఆమహావిద్వాంసుని విద్వత్తు, విజ్ఞత, అనేకవిధాల శ్లాఘించాడు. శివస్వామి మరికొంత సేపు మంత్రితో ఇష్టాగోష్ఠి జరిపి తిరిగి తన భవంతికి వెళ్ళిపోయాడు.

శూరమంత్రి మళ్లీ మథనలో పడ్డాడు. శివస్వామి వివరించినట్లు కాశ్మీర రాజ్య ధర్మనిర్వహణం కన్న వేరే పరమశివార్చన ఏమి ఉంది? అది అక్షరాలా యథార్థమే!

అయితే ఇటీవల ఆ ధర్మనిర్వహణలో తాను కొంచెం పొరబడ్డానేమోనని మంత్రికి కొంచెం భయంవేసింది. అదే సమయంలో

అతని హృదయంలో ఆ వృద్ధమాత దీనాక్రోశం మంద్రమంత్రంగా ప్రతిధ్వనించింది. ఆ బందిపోటు దొంగ తల్లి అంత దీనంగా ఆక్రోశిస్తూన్నా వినిపించుకోకుండా వెంటనే అతనికి ఘోర మరణదండన విధించాడు. కాని తన కుమారుడు చేసిన తప్పిదం ఇంతవరకు ఇతరు లెవరికీ తెలియ జేయలేదు. అత డపహరించిన హారం తిరిగి భూతేశ్వర దేవాలయం ధర్మాధిపతికి జేరి ఉండవచ్చును. కాని ఆ విషయం తనపై ధర్మాధికారి అయిన మహారాజు అవంతివర్మకు తెలియజెయ్యకపోవడం ఒక పెద్ద తప్పిదమే అని మంత్రి నిశ్చయించుకొన్నాడు. వెంటనే మహారాజ సన్నిధికి వెళ్ళి ఆ విషయం అంతా ఆ మూలాగ్రంగా పూసగుచ్చినట్లేకరువుపెట్టాడు. తన కుమారుని అపరాధానికి తగిన శిక్ష విధించవలిసిందని చేతులు జోడించి ప్రార్థించాడు.

అవంతివర్మ ధర్మదేవత సాక్షాత్కరించినట్లుగా తనకెదురుగా దోసలిఒగ్గినిలబడిన శూర మంత్రిని చూచి కొంతసేపటివరకు నోటమాట లేక అలాగే నిర్ఘాంతపోయాడు. ఆపైన కలకలనవ్వాడు:

"మీ కుమారునికి శిక్ష విధించడానికి నేనెవరిని! మీరే ఈ కాశ్మీరరాజ్యాని కంతటికి ధర్మాధికారులు! ఆ ధర్మమేదో మీరే నిర్ణయించండి!"

మంత్రి ఇంకా అలాగే దోసిలిఒగ్గి నిలబడి తిరిగి సవినయంగా విన్నవించుకొన్నాడు:

"మహాప్రభూ! తమరలాగ సెలవియడం ధర్మంకాదు. ఈ రాజ్యానికంతటికీ ఏకైక ధర్మాధికారులు తామే! మీ తరవాతనే నా ధర్మాధికారం. ఈ విషయంలో అపరాధం చేసినవాడు సాక్షాత్తు నా కుమారుడు! అందుచేత నేనీవిషయం నిర్ణయించడం న్యాయంకాదు! కనక ఇక మీరే ఇక్కడ ధర్మనిర్ణేతలు!"

అవంతివర్మ మళ్ళీ కలకల నవ్వాడు:

"కావచ్చును! ఇంతకీ మీ కుమారుడపహరించిన హారమేమో తిరిగి అమ్మవారికి జేరిపోయిందికదా! దీనిలో ఇక అతని అపరాధమేమి ఉంది?"

"ఏది ఏమయినా ఈ విషయం తమకు నివేదించడం నా ధర్మం! ఆ పైన తమ చిత్తం!"

అని ఇంకా అలాగే దోసిలికట్టి నిలుచున్నాడు మంత్రి. కాని మహారాజా విషయం అంతటితో తుంచివేసి మంత్రితో ఇష్టాగోష్ఠి ప్రారంభించాడు.

దానితో మంత్రికి కొండంతభారం గుండెలమీదినించి దింపివేసినట్లయింది. వెంటనే అతడొక్క నిట్టూర్పు విడిచిపెట్టాడు. మహారాజు దగ్గర సెలవుతీసుకుని తన భవంతికి తిరిగి వెళ్ళిపోయాడు.

భవంతికి తిరిగి రాగానే శ్రీనగర దండ దండనాథుడు దర్శనంకోసం చాలాసేపటి నించి వేచిఉన్నాడని ఒక పరిచారకుడు విన్నవించాడు. వెంటనే మంత్రి మంత్రాగారంలోకి వెళ్ళిపోయాడు. శ్రీనగర దండనాథు డక్కడ దీనంగా చేతులు కట్టుకుని నిలబడ్డాడు. మంత్రి అతన్ని చూస్తూనే ప్రశ్నించాడు: "ఏమి! ఏమైంది? ఆ రత్నాంగుళీయకం దొరికిందా?"

"లేదు!"

"లేదా! ఇన్నాళ్లనించీ మీరంతా ఏమి చేస్తూన్నట్టు? మహాశివరాత్రిలోగా మీరా ఉంగరం పట్టుకుని తీరాలి! అంతవరకు మీరిక నాకంటపడవద్దు! మహాశివరాత్రికి మహారాజు స్వయంగా భూతేశ్వరస్వామికి పూజాఅభిషేకాలు చెయ్యబోతున్నారు! తెలిసిందా?"

ఆ గర్జన విని దండనాయకుడు తలవంచుకొన్నాడు:

"ఎంతప్రయత్నించినా మా కవి లభ్యం కాలేదు!"

"నాకది అంతా తెలియదు! మహాశివరాత్రిలోగా మీరా ఉంగరం పట్టుకుని తీరాలి!"

అని మంత్రి తటాలునలేచి తన అభ్యంతర మందిరంలోనికి వెళ్లి పోయాడు.

## ౬

అటుపిమ్మట రెండుమూడురోజులదాకా మంత్రి పరమేశ్వర పాదధ్యానంలో నిమగ్నుడైనాడు. క్రమక్రమంగా అతని హృదయంలో వారణాసికి వెళ్ళిపోవాలనే కాంక్ష ఇనుమడించింది. ఆ మరునాడే ఆమహారాజును దర్శించి తన కోరిక తెలుపుదు చేసుకున్నాడు. క్రమక్రమంగా తన శరీరపాటవం తగ్గిపోతున్నదనీ, కుమారుని మూలకంగా మన స్తిమితం తప్పిందనీ తన విజ్ఞప్తి మన్నించవలసిందనీ ప్రార్థించాడు. కాని అవంతివర్మ ఆ మాట బొత్తిగా వినిపించుకోలేదు:

"నేను నామకః కాశ్మీరాధిపతిని. మీరు నాకు పితృసమానులుగానిలిచి ఇన్నాళ్లనించీ ఈ రాజ్య సంరక్షణభారం వహించారు. అందుచేత ఈ విషయం నిర్ణయించవలిసిన వారు మీరే! ఒకవేళ మీరుకాదు, కూడదని

# పరమశివార్పణ

వారణాసికి వెళ్ళదలిచిన పక్షంలో మీవంటి ధర్మమూర్తి నెవరినైనా ఇంకొకరిని మీ ధర్మాసనంమీద కూర్చోబెట్టి మరీ వెళ్లండి! అంతే నా కోరిక!”

అని కలకల నవ్వాడు. మంత్రికేక ఏమన డానికీ పాలుపోక మధ్యాహ్నం పూజా వేళకు మళ్ళీ తన భవంతికి తిరిగి వచ్చి వేశాడు. వెంటనే పరమేశ్వర పాదపూజలో పడి బాహ్య ప్రపంచమే మరిచిపోయాడు. పూజా పునస్కారాలన్నీ ముగించుకొని భోజనంచేసి కొంచెంసేపు విశ్రమించడం మంత్రికొక అలవాటు. ఆనాడుకూడా అతడలాగే తన రహస్య మంత్రాగారంలో కొంచెంసేపు విశ్రమించాడు.

అంతలోనే శ్రీనగర దండనాథు డతని సందర్శనానికి వచ్చాడు. మంత్రి తొందరగాలేచి ఎంతో ఆత్రంగా అతన్ని రహస్య మంత్రాగారంలోని కాహ్వానించాడు.

దండనాథుడు మంత్రితో కలిసి ఒక అరగడియసేపు మాత్రమే సంప్రతింపులు జరిపాడు. వెంటనే తిరిగి వెళ్లిపోయాడు.

పినాకధన్వ ఇన్నాళ్లనించీ తండ్రి భవంతిలో అంటీ అంటనట్టు కాలక్షేపంచేస్తూ తల్లి తండ్రులకెంతో అనువర్తనగా ఉన్నట్టు నటిస్తున్నాడు.

దండనాథుని రాకపోకలతో అతనికేదో అనుమానం వేసింది. కాని వారిరువురి మధ్య ఏమి నడిచిందో అతనికి తెలియలేదు. అంతలో కూరమంత్రి అతన్ని గట్టిగా గొంతెత్తి పిలిచాడు. ధన్వ ఎంతసేపటికీ తన దగ్గిరికి రాకపోతే అతనే అతనిదగ్గిరికి వెళ్ళి ఒక సుఖాసనంమీద కూర్చున్నాడు.

పినాకధన్వ తతనిముఖవైఖరి చూడగానే పైప్రాణాలుపైనే ఎగిరిపోయాయి. మంత్రి రూక్షంగా కుమారునివైపు చూశాడు:

“అమ్మవారి అంగుళీయకం నీవేమిచేశావు! నిజం చెప్పు!”

“నాకు దానివిషయమేమీ తెలియదే!”

“నీకు తెలుసును! అబద్ధాలాడకు! ఇప్పటికైనా నిజంచెబితే నీ ప్రాణాలు నిలుస్తాయి! నామాట విను.”

పినాకధన్వ తెల్లబోయాడు. ఆ భయోద్వేగంలో అతనికేమనాలో తెలియలేదు. మళ్ళీ అలాగే తనకేమీ తెలియదని సమాధానం చెప్పాడు. అదివినగానే మంత్రి ముఖం అగ్నిజ్వాలలా జేవురించింది. తన పక్కనే దంతపేటికలో దాచిన అమ్మవారి రత్నాంగుళీయం పైకెత్తి పట్టుకున్నాడు:

(54-వ పేజీ చూడండి)

# వేలంపాట

బి. విద్యాసాగర్

నేను వేలంపాట ఎక్కడయినా పాడుతుంటే, కొద్దిగా దూరంగా వుంటాను. ఎందుకంటారేమో! నాకుఎప్పుడూ అందులో కలిసిరాదని నమ్మకం. ఆ మాటకువస్తే లాటరీలన్నా నాకు నమ్మకంలేదు. ఎవళ్ళో అదృష్టం వున్న కొద్దిమందికి తప్ప అందరికి వాటిలో కలిసిరాదని నా విశ్వాసం. ఎవరి సంగతి ఎలావున్నా, నామటుకు నేను ఎప్పుడూ ఈ లాటరీలలో కాని, వేలంపాటలలో కాని, నష్టపోవడమే కాని, లాభం పొందిందిలేదు.

ఒకసారి మా అన్నయ్యా, నేను బజారుకు వెళ్ళాము. రోడ్డుకు వొక ప్రక్కన వొక షావుకారు, చీరలు, ధోవతులు, యింకా షర్టుగుడ్డలూ, అవీ ఇవీ వేలంపాటలో అమ్ముతున్నాడు. పోతున్నవాళ్ళము కాస్తా ఆగిపోయి, అక్కడకు వెళ్ళేము. నేను వద్దంటునే వున్నాను. కాని అన్నయ్య వూరుకోలేదు. వాడికి ఎందువలనో ఈ వేలంపాటలంటే సరదా! సరే! వెళ్లినవాళ్లము వూరుకోవచ్చునుగా! వుహు! అలా కాదు! మా అన్నయ్య ప్రతి చీర వంకా పరీక్షగా చూస్తున్నాడు. ఏదో పెద్ద కొనేవాళ్లకు మల్లే! జేబులో అంతా కలుపుకున్నా అయిదు రూపాయిలకంటే లేదు. దానితో ఏమివస్తుందో వాడికే తెలియాలి! గట్టిగా షావుకారు నిలవేస్తే తెల్లమొహం వెయ్యాలి. అలాగుంది మా పరిస్థితి!

ఇంతలో వొక జరీచాపు పాటకువచ్చింది ఎంత పాడినా ధర పలకడంలేదు. ఎనిమిది రూపాయిల దగ్గర ఆగిపోయింది. జేబులో డబ్బులేదు కాని, అప్పటికి అన్నయ్య వొక వూపు వూగాడు. షావుకారు వొకటి రెండుసార్లు 'ఎనిమిది రూపాయలు! ఎనిమిది రూపాయలు!' అని, విసుగుపుట్టి చీరను పెట్టిలో పడేసుకున్నాడు. ఆయనకు అది ఇచ్చేయడం ఇష్టం లేదల్లేవుంది! అందుకని ఆయన, అందరికంటే ఎక్కువపాట పాడిన ఆసామితో బేరం మొదలుపెట్టాడు. ఒక అర్ధరూపాయి కమీషన్ యిస్తానన్నాడు. వుహు! అలా కాదు. రూపాయి కావాలన్నాడాయన. కాసేపు గింజాకుని, చివరికి, రూపాయి యిచ్చేసి, షావుకారు మరో వస్తువు బయిటకు తీశాడు.

నాకు ఆశ్చర్యమేసింది, ఏమిటి! ఊరికే పాట పాడినందుకే రూపాయిడబ్బులు చేతికి వచ్చాయే! మనముకూడా పాడితే బావుండును. మనకు కూడా కమీషను వస్తుంది! కాని షావుకారు నిలవేస్తే సమాధానం చెప్పటం ఎలా! తెలకరాదు! అన్నయ్య దగ్గర మాత్రం డబ్బు ఎక్కడున్నది? అనుకుని మాట్లాడకుండా వూరుకున్నాను. అయినా అన్నయ్యకు వుషారుగానే వుంది.

"బలే తమాషాగా వుందిరా! ఊరికే పాట పాడినందుకే రూపాయిడబ్బులు చేతికి వచ్చినాయ్!" అన్నాడు ఉత్సాహంగా.

"నీ మొహం! అందరికీ అలారావు! దేనికయినా అదృష్టం ఉండాలి" అన్నాను.

"నీదంతా పిచ్చికానీ, మనకుమాత్రం కమీషన్ రాదుటరా! నాలుగు వస్తువులమీద నాలుగురూపాయలువస్తే చాలదూ!"

"సరే! నీఇష్టం" అన్నాను చేసేదిలేక.

వేలంపాట సాగుతునే వుంది. మేము కాస్తదగ్గరగా వెళ్ళేము. ఇంకో వస్తువుకు కూడా ధర పలుకలేదు, పాటలో షావుకారు, యింకొక రూపాయి కమీషనుక్రింద సమర్పించుకున్నాడు. అన్నయ్య నాలుక కరుచుకున్నాడు. అరెరే! తను పాడినా పోయేది, తనకొచ్చేది ఆ రూపాయి! ఇలా సాగింది వాడి ఆలోచన. అయినా మించిపోయింది ఏమీలేదుగా! ఇంకా చాలా వస్తువులు పాటకు వున్నాయి.

ఉత్సాహంగా ముందరకెళ్ళి నుంచున్నాడు. షావుకారు వొక చీర బయటకు తీశాడు. పాట మొదలుపెట్టారు. ఈసారి వదిలిపెట్టకూడదు! అందరికంటే ఎక్కువ పాడి కమీషను పుచ్చుకోవాలి అని మా అన్నయ్య వొక నిశ్చయానికి వచ్చాడు.

"ముప్పయి రూపాయిలు! ముప్పయి రూపాయిలు! జరీచీర ముప్పయిరూపాయిలు" అని అరుస్తున్నాడు షావుకారు.

అన్నయ్య కాసేపు తటపటాయించాడు. పై పాట పాడటమా! వూరుకోవడమా! పాడితే దండుగలేదు. ఎలాగూ ఆ ధరకు అతనికి గిట్టదు. కమీషను యివ్వకేమిచేస్తాడు అని మనస్సులో అనుకున్నాడు. ఇట్లా ఆలోచిస్తుంటే, పాట నెమ్మదిగా ముప్పయితొమ్మిదికి పెరిగింది. ఇక వూరుకుంటే లాభంలేదు. ఆలసించిన ఆశాభంగం! ఈ ఛాన్సుకూడా పోతుంది.

"జరీచీర ముప్పయితొమ్మిది మాత్రమే! మీరు బజారులో కొంటే యనభైరూపాయలకు తక్కువలేదు!.....బోలో సాబ్! ముప్పయితొమ్మిది రూపాయలు! ముప్పయితొమ్మిది రూపాయలు" అంటున్నాడు షావుకారు.

అన్నయ్య ఈ లోకంలో లేడు. ఎలాగయినా కమీషన్ పుచ్చుకోవాలనే పట్టుదలలో వున్నాడు. ఇంకా ఆలోచిస్తూ కూర్చుంటే లాభంలేదు. ఈ ఛాన్సుకూడా పోతున్నది అని ధైర్యంచేసి "నలభై" అనేశాడు. పాట సాగుతునేవున్నది. అన్నయ్య గుండెల్లో రైళ్ళు పరుగెత్తుతున్నాయ్! అయినా ధైర్యంగానే వున్నాడు.

షావుకారు వొకటిరెండుసార్లు 'నలభై' అని పాటకొట్టేశాడు. చచ్చిరి సోదరుల్! ఏమిటిచేయడం!

"ఏమండీ! చూస్తారేమిటి! డబ్బులు యిచ్చి తీసుకోక" అన్నాడు షావుకారు చీర చేతికిస్తూ.

అన్నయ్యకు నోటివెంట మాటరావడంలేదు. డబ్బు ఎక్కడవున్నది! అనవసరంగా తొందరపడి పాట పాడేశాడు. ఇప్పుడు ఏమిటి చెయ్యడం! నాకూ యేమీ పాలుపోవడంలేదు. ఏమి చూసుకుని అన్నయ్య పాటపాడేడో తెలియకుండావుంది. మరీ అంత మొండిధైర్యం అయితే ఎలా! ముందూ వెనుకా చూసుకోనక్కరలే! ఉన్నట్లుండి యిప్పుడు నలభైరూపాయలు

కావాలంటే. ఎక్కడనుంచి వస్తాయ్! కాస్తో కూస్తో అన్నయ్యదగ్గర యేమన్నా మిగిలితే, అదికాస్తా పేకాటలో కుమ్మరించి చేతులు కడుక్కు కూర్చున్నాడు. ఇకపోతే జేబులో అయిదురూపాయలు మిగిలాయ్! అవి వీమూలకు వస్తాయ్! ఏమిటో! ఏమిచేయడానికి తోచడంలేదు.

ఇక ధైర్యంచేసి "చీర అక్కరలేదు! కమీషన్ ఇవ్వండి" అని అడిగాడు అన్నయ్య.

షావుకారు పక్కన నవ్వాడు. "పాట కొట్టేసిన తరువాత యింకా కమీషను యేమిటండీ!" అన్నాడు.

"చీర వద్దనుకున్నాము లెండి" అని చెప్పాడు అన్నయ్య. నిజానికి మాకది అక్కరలేదు!

అయితే షావుకారు వూరుకుంటాడా! "ఏమండోయ్! పాటకొట్టేసిన తరువాత, కమీషనంటూ వుండదు. ఆలస్యంచేయక డబ్బు యివ్వండి" అన్నాడు.

అసలుకు డబ్బు ఎక్కడున్నది! అన్నయ్యకు పిచ్చులూ, వెర్రులూ ఎక్కుతున్నాయ్! ఏమి మాట్లాడుతున్నాడో, వాడికే తెలియదు ఖంగారుగా "నీదగ్గర ఎంత వున్నదిరా!" అని అడిగాడు.

"నాదగ్గర మాత్రం ఏమున్నది. ముప్పావలో, రూపాయో వున్నది. అదయినా సిగిరెట్లకోసం దాచుకున్నది! ఇప్పుడు అన్నయ్య అది కాస్తా ఇమ్మంటాడేమో ననుకున్నాను.

కానీ అన్నయ్య, షావుకారును ఇవతలకు పిలిచి "మావాడిని ఇంటికి పంపించి డబ్బు తెప్పిస్తాను. కాస్త ఆగండి!" అని చెప్పాడు. నేను వింటూనే వున్నాను. ఏమిటి! వీడు ఇంత పచ్చిఅబద్ధం ఆడుతున్నాడు! ఇంట్లోమాత్రం డబ్బు ఎక్కడున్నది? అంతా నిండుకుని, నాలుగు రోజులయింది.

"త్వరగా తెప్పించండి" అన్నాడు షావుకారు.

"అలాగే!" నని చెప్పి అన్నయ్య నన్ను అవతలకు తీసుకెళ్ళాడు.

"ఒరే! మీ వదినను అడిగి వొక నలభై రూపాయిలుంటే తీసుకురా!" అన్నాడు ఖంగారుగా.

వాడి ఖంగారు మండిపోనూ! ఆవిడ దగ్గర మాత్రం ఎక్కడిది!

"లాభంలేదు" అని చెప్పాను.

"అయితే, మామయ్యగారింటికి వెళ్ళి త్వరగా వొక నలభై రూపాయలు అడిగి తీసుకురా! ఇక్కడున్నట్లు రావాలి! తెలిసిందా" అన్నాడు.

సరే! వెళ్ళక తప్పిందికాదు. వెంటనే మామయ్యగారింటికి వెళ్ళి డబ్బు తీసుకున్నాను. సమయానికి ఆయన చేతిలో వున్నది. లేకపోతే మాపని యేమయేదో!... ఏమవుతుంది! రిష్టువాచీ, పెన్ను లాక్కుని యింటికి పంపించేవాడు. అమ్మో! ఇంకా ఏమన్నా వుందా! అలా జరిగితే, మళ్లీ ఆవూళ్ళో తలెత్తుకు తిరగగలమా!

డబ్బు తీసుకువెళ్ళి షావుకారు మొహాన కొట్టి చీర తీసుకున్నాము. ఇక ఎక్కడికీ పోబుద్ధి కాలేదు. ఇంటి ముఖం పట్టాము. ఇవేళ ఎవరిమొహం చూశామో కాని, మర్యాదగా బయటపడ్డాము. లేకపోతే, హరిశ్చంద్రుడిలాగా మమ్మల్ని బేరానికి పెట్టవలసివచ్చేది!

దిగాలుపడుతూ, ఇంటికి చేరుకున్నాము. వదిన ఆదుర్దాగా చీర విప్పిచూసింది. ఒక పక్క చిరుగు వున్నదిట! ఇంకేమి! గుణుపు మొదలుపెట్టింది.

"ఎందుకు తీసుకున్నారండీ ఈ పాడు చీర" అంది విసుగ్గా.

దండుగ పడ్డామని మేము యేడుస్తుంటే, ఈవిడ చీర నాణ్యం చూస్తున్నది. అంతటితో వూరుకోవచ్చునుగా! దొడ్డిదోవన వెళ్ళి పక్కింటి అమ్మలక్కలను అందరిని పిలుచుకు వచ్చింది. వాళ్ళంతా చేరి, చీరధర ముప్పై రూపాయిలకంటే ఎక్కువ వుండదని నిర్ధారణ చేశారు.

మొగవాళ్ళకు బేరాలు తెలియవు! వాళ్లను బజారుకు ఎందుకు పంపించారు. మీరే వెళ్లి తెచ్చుకుంటే పోయేదిగా!" అంది వొకావిడ.

అన్నయ్యకు తలకాయ కొట్టేసినట్లయింది. మాట్లాడకుండా యిద్దరమూ, వరండాలో కూర్చున్నాము. ఇంకా మాటలు వినపడుతునే వున్నాయి.

"అది కాదండీ! ఆయన వేలంపాటలో కొన్నారట" అంది మా వదిన.

"బాగానే వుంది! అంత కళ్ళు మూసుకు ఎలా తీసుకున్నారమ్మా!" అంది వొకావిడ.

చచ్చాము! గోరుచుట్టు మీద రోకలిపోటన్నట్లు ఈమాటలు ఏమిటి! అయినా ఆసక్తిగా వింటున్నాము.

"అసలు చీరలో నాణ్యం లేనిదే! ముప్పయి రూపాయిలకుకూడా దండుగే నమ్మా!" అంది వొక ఇల్లాలు.

"చీరకు జరీ వున్నదండి" అంది మావదిన.

"జరీవుంటే మాత్రం నలభైయేమిటమ్మా! మరీ విడ్డూరం! మొన్న మా కోడలుకు తీసుకున్నాము. యిలాంటి చీరే! ముప్పయి రూపాయిలయింది. జరీ అదీ, యింతకంటే బాగానే వుంది" అంది ఆఇల్లాలు మాటలు సాగతీస్తూ.

"ఆయన ఎప్పుడూ ఇంతేనండీ! ఏదో వొకటి దండుగచేస్తూ వుంటారు" అంది వదిన నెమ్మదిగా.

ఇక భరించలేకపోయాము. కుర్చీలో నుంచి లేచి పార్కువైపుకు బయలుదేరాము.

* * *

ఇంతకంటే గమ్మత్తు జరిగింది. మరొకసారి. నేను అప్పుడు హైదరాబాదు పోతున్నాను. అప్పుడుకూడా రైలులో వేలంపాట జరిగింది. ఇది ఎందుకు చెపుతున్నానంటే, ఎంతో జాగ్రత్తగా వుండే నేనే, అప్పుడు పప్పులో కాలేశాను.

అదేదో స్టేషనులో రైలు ఆగిపోయింది. ఇంజను నీళ్ళు పోసుకోవడానికి పోయింది. ఎవరో సర్దార్జీ, చేతిలో వొకపెట్టి పుచ్చుకుని మా కంపార్టుమెంటులోకి ఎక్కాడు. మాదగ్గరకువచ్చి పెట్టి తెరచి.

"ఇదిగో చూడండి సాబ్! నేను కొన్ని వస్తువులు అమ్మకానికి తెచ్చాన్! వేలంపాట పాడండి! ధరగిట్టితే వస్తువు ఇస్తాన్! లేకుంటే అందరికీ కమిషన్ ఇస్తాన్" అంటున్నాడు.

నాకు ఏమీ అర్థంకాలేదు. మళ్ళీ అతను అందుకున్నాడు. "ఇది క్రొత్తరకం పాట సార్! పాటపాడిన వాళ్ళందరికీ కమీషన్ వస్తుంది... దేఖో సాబ్! ఈ బ్యాటరీ లైటు బజారులోకొంటే ఐదు రూపాయిలకు తక్కువకాదు. నేను అర్ధరూపాయితో పాట మొదలు పెడుతున్నాను" అన్నాడు.

అందరూ ఆశ్చర్యంగా చూశారు. పాట మొదలు పెట్టారు. పదణాలు; ముప్పావలా! ఇలా సాగిపోతున్నది. చివరికి రూపాయిన్నర దగ్గర ఆగిపోయింది.

సర్దార్జీ అందరివంక చూసి "దేఖో సాబ్! ధర గిట్టలేదు కనుక అందరికీ కమీషన్ ఇస్తాన్!" అని పాట పాడిన వాళ్ళందరికీ తలొక దువ్వెన యిచ్చాడు.

నాకు ఆశ్చర్యంగానేవుంది. ఏమిటో ఊరికే పది దువ్వెనలు ఇచ్చేశాడు. ఇందులో ఏదో కిటుకువుంది. కాని, అర్థంకావడం లేదు. ఇలాంటి వేలంపాట ఎక్కడా చూడలేదు.

"చూడండి సాబ్! ఈ బాక్సు, ఫౌంటన్ పెన్ కలిపి బేరానికి పెడుతున్నాను. బోలో సాబ్! జల్దీబోలో!" అంటున్నాడు.

ఎవరో అర్ధరూపాయన్నారు. నేను ధైర్యంచేసి పదణాలన్నాను. ఇంకా పాట పెరిగి రూపాయి పదణాల దగ్గర ఆగిపోయింది.

(55-వ పేజీ చూడండి)

## గోవిందరాజు శ్రీనివాసమూర్తి

పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది.

కాని,

జానకిరాముడు పుట్టగానే కెవ్వున కేక వేశాడు. ప్రపంచమంతా ఘొల్లున ఆనందించింది.

తల్లీ దండ్రీ తలోలోకానికి వెళ్ళిపోయారు ఆనందంతో.

ముద్దుబిడ్డ జానకిరాముడు.

చంద్రబింబం జానకి రాముడు.

ముక్కోటి సూర్యుల వెలుగు నిజానికి జానికిరాముడు.

తండ్రికి పట్ట పగ్గాలులేవు ఇంత బ్రహ్మాండమైన కొడుకును కన్నందుకు. తల్లికి విపరీతమైన ఆనందం పుట్టుకొచ్చింది.

ముద్దులాలక పోశారు తల్లీ తండ్రీ.

ముద్దుబిడ్డ జానకిరాముడు.

* * *

ఓరోజు బ్రహ్మలోకంలో ఓనల్లటి పెద్ద బండరాయి ఎందుకూ కాకుండా పడి ఉన్నట్టు తోచింది బ్రహ్మకు. ఏవస్తువునైనా ఊరికే పారవేసేందుకు మతరామూ ఇష్టంలేదు అతగాడికి. అందుకని బండరాయికి మానవాకారం తెచ్చాడు. బాగా కుదిమట్టం చేశాడు. ఫరవాలేదనుకున్నాడు. జీవం పోశాడు. భూమిమీదకు విసరాడు. అంతే—.

వచ్చి బాపమ్మగారి వళ్ళోపడింది. జీవంతో ఉన్న నల్లగా కుదిమట్టంచేసిన బండరాయి. పదోరోజు జానకిరాముడై కూర్చుంది. ముద్దులాలకపోసింది.

ముద్దుల జానకిరాముడు దిన దినాభివృద్ధి గాంచుతూ అలా కులాసాగా ఉండగా ఛటుక్కున పదోఏడు వచ్చికూర్చుంది. ఓ శుభ ముహూర్తాన పెద్ద తతంగం లేకపోయినా ఓచిన్న సైజు పెళ్ళిలా అక్షరాభ్యాసం చేసి బళ్ళో వేశారు. ఓ విధంగా తమ బాధ్యత తీరిందనుకున్నారు తలిదండ్రులు. ఇహ చదువుతాడు. బియ్యేలు ఎమ్మేలు పాసవుతాడు. కలెక్టరవుతాడు. ఇంకా పైవాడు కూడ కావచ్చు ముద్దులజానికి రాముడు.

నల్లగా కుదిమట్టంగా దొర్లుతూఉంటే జానికిరాముడు బళ్ళో గోటీకుర్రకారుకు అంత ముద్దురాలేదు. ఎనిమిదోఏడు దాటినా ఒకటవక్లాసు దాటి రాకపోవటం చూసి ముద్దు రాముణ్నిని "మొద్దు రాము"డన్నారు ఒకసెట్టు కుర్రకారు. నికార్సయిన తారు పడబోసిన రంగు కాబట్టి మరి కాస్త ముద్దుగా "నల్లరాము" డన్నారు మరోకసెట్టు కుర్రకారు. రెండుసెట్లు కలిసి నామాంతరాలను ఏకంచేసి "నల్లమొద్దు" అన్నారు. ఆరోజునుంచి విద్యార్థిదశలో జానికిరాముడికి 'నల్లమొద్దు' సార్థకనామమైంది.

నల్లమొద్దుకు చదువు ఆట్టేరుచించలేదు చేగోడీలు పుణుకులు కనకపువ్వులో ఉన్నరుచి ముందు. పెధవచదువు-బోడిచదువు చదువెందుకు—చేగోడిలు పెట్టదు—కనుక



"ప్రేమ విఫలమైతే ఆత్మహత్య చేసుకోవాలి, లేకపోతే సినిమాహాలుదగ్గర అట్లు పోసుకోవాలి"

# ★ ఉమ్మెత్త పువ్వు ★

చదువుల్లో ధ్యానం లేదు. ఇలాంటి మనస్తత్వం కలిగింది కల్లమొద్దులో. దాంతోటి థర్డ్ ఫారందాకా చేసేసరికి ఇరవై మూడేళ్ళు నిండుకున్నై-చదువుకు స్వస్తిచెప్పాడు.

అక్కడనుంచి రెండవ అధ్యాయం ప్రారంభం అయింది జానకిరాముడిలో. తాందిగా జానకిరాముడు జానకిరామయ్య అయ్యాడు.

ఇప్పుడు జానకిరామయ్య పెద్దమనిషి. పైరుకూడ పేర్చుకుంటున్నాడు. పది మందికి పెట్టగలస్తోమత సంపాదిస్తాడు ముందు ముందు. తండ్రి ఏనాడో పోయాడు. ఇహ ఒకతల్లి తల్లినిగాక కనీసం మరో తొమ్మండుగుర్ని భరాయించవచ్చు. జానకిరామయ్యలో ఏదో మానవాతీత శక్తి బయలుదేరింది. తనేదో మహత్తరమైన కార్యాన్ని సాధిస్తాడు. జన్మ సఫలం చేసుకుంటాడు.

కుర్రవాడి తరహాచూసి బాపమ్మగారికి అతగాడిమీద ప్రేమ సన్నగిల్లింది. నిజంగా మొద్దురాముడేమోనన్న అనుమానం బయలుదేరింది. మొదటిసారిగా ఓ విషమయిన భయం ఆవహించింది. దాంతోటి ఆరోగ్యం అడుగంటింది. ఓరోజు తెల్లవారుఝామున "హరీ" అంది.

తల్లిదండ్రీ లేనివాడు జానకిరామయ్య. తన ఇరవై నాలుగేళ్ల జీవితంలోనూ కొండంత అనుభవం గడించినట్లు అనుకునేవాడు. తనకూ స్నేహితులున్నారు. ఆప్తమిత్రులున్నారు. ఒకడు సినిమాహాలుదగ్గర అట్లు అమ్ముతాడు. కానిపరమవేదాంతి. "మానవుడెందుకు పుట్టాడు? ఎందుకు జీవిస్తున్నాడు? ఎందుకు చస్తున్నాడు?" మొదలైన విషయాలు క్షుణ్ణంగా తెలుసుకుని జానకిరామయ్యకు సలహాలిస్తాడు. పేరు కోదండం. అట్లుపోయడంలో ఎంత ప్రజ్ఞఉందో తను పుట్టాక ఫలానా ప్రతిదినమయింమీదకూడ అంత ప్రజ్ఞఉంది. జానకిరామయ్యకు కోదండం గురుతుల్యుడు. మార్గదర్శి—

ఓరోజు జానకిరామయ్య సినిమాకు వెళ్లాడు. ముందుగా తనగురువును కలుసుకున్నాడు. అసలు గురువును కలుసుకునేందుకే సినిమాకు వెళ్లాడు. ఆప్యాయంగా రెండు అట్లు తిన్నాడు. "ఎలా ఉన్నావ్. ఆరోగ్యం బాగుందా?" అని పరామర్శ చేశాడు. ఇహాతన కథ మొదలెట్టాడు.

"ప్రేమనుగురించి నీ అభిప్రాయం ఏమంటావోయ్?" అన్నాడు.

కోదండానికి ఎవరో చరిచినట్టయింది. ఇహ రంగంమీదికి దూకే ఉద్రేకంలో అట్ల కాడ విసిరిపారేసి అట్ల జంగిడి పక్కకునెట్టి "ఏమన్నావ్" అన్నాడు.

"అదే ప్రేమనుగురించి నీ అభిప్రాయం?"

"ఏం, ఎందుకు?" అన్నాడు కోదండం.

ఎందుకో చెప్పకుండా "మానవులు ఎందుకు ప్రేమిస్తారు?" అని రెండో ప్రశ్న వేశాడు బీడీ ముట్టించి.

"ఏమిటోరక" అన్నాడు కోదండం నవ్వుతూ.

"హాస్యాలు కట్టిపెట్టి మామూలుగా మాట్లాడు!" అన్నాడు జానకిరామయ్య కాస్త చిరాకుగా.

కోదండంనవ్వు ఆగింది. ఇంక తన పాండిత్యం కట్టలుతెగి ప్రవహిస్తుంది. తనో బీడీ ముట్టించి మొదలెట్టాడు. "అవును. ఎందుకు ప్రేమిస్తారంటావ్. ఏమో, మరి ప్రేమిస్తున్నారు. అలవాటయి ఉంటుంది. పైగా పనికూడా అదే ఉన్నట్టు తోచదు. నేనూ ప్రేమించాను. విఫలమయింది. అట్లు పోసుకోవడమే ఆనందంగాఉంది. కాని నీకతహా తెరనుకో. నీది నిజమయిన ప్రేమ అని అనుమానం." జానకిరామయ్య ముఖం వికసించింది.

"ప్రేమించు. కాదనను. కాని ప్రేమించిన కన్యకోసం భూమికొసకు పరుగెత్తేందుకు కూడా వెనుదీయకు. ప్రేమించడం అంటే ఆ కన్య నీదిఅవాలి అన్నమాట. అంటే పెళ్ళితో ముగియాలి కథ. ఇంతకీ, అసలు నీ కీగొడవ ఎందుకు? ప్రేమించావా ఏమిటి ఖర్మం?"

జానకిరామయ్య నేలవంక చూశాడు. బీడీ అవతల పారేసి చెప్పోటి కోడుమీది దుమ్ముతీసి మెల్లిగా నవుల్తూ "అవును" అన్నాడు.

మళ్ళీ కోదండం మాట్లాడకముందే ప్రారంభించాడు. "అవును. ప్రేమించాను. మాఇంటి పక్క అమ్మాయిని. చాల బాగుంటుంది. దివ్యసీమల్లోంచి దిగి మిటుకూ నాకోసమే దిగివచ్చిందా అన్నట్లు ఉంటుంది."

మళ్ళీ బీడీ వెలిగించే ప్రయత్నంలో ఉన్న జానకిరామయ్యని చూచి "కోదండం ప్రేమించి ఏం చేద్దామని." అన్నాడు.

జానకిరామయ్యకు మళ్లీ చిరాకేసింది. ఏదో సలహాకోసం వచ్చిన తనను ఇలా ఎదురు ప్రశ్నలు వేయడం నచ్చలేదతడికి. ఇహ కోదండాన్ని మాట్లాడకుండా చేసేందుకు ఏక బిగిని చెప్పుకు పోయాడు.

"అవును. ప్రేమించాను. ఏం నాకు హక్కులేదా? ప్రేమించాను. నా ప్రేమను ఆమెకు తెలియజేసి తద్వారా ఆమెకు నామీది ప్రేమను తెలుసుకుని జీవితాన్ని చిలవలు పలవలు తొక్కిద్దామని మోజుపడ్డాను. అంతా భ్రాంతిఅయింది. ఓరోజు ప్రొద్దుట నా ప్రేమను కాగితంద్వారా తెలియజేశాను. సాయంత్రానికి బ్రహ్మాండం పగిలింది. ఆ అమ్మాయి అన్నయ్య కత్తులునూరాడు నామీద. పిలువ వేస్తానన్నాడు. చుట్టూరా జనం పోగడారు. అంతా అదోకథ— అయిందా. కాని ఏదోలాఉంది. పదిమంది నోళ్ళలో పడ్డాను. తల తీసేసినట్టుంది. ఏం చేయమంటావ్?" అన్నాడు.

కోదండం జానకిరామయ్య గొడవను ఆట్టే పట్టించుకోలేదు. విఫలమయిన ప్రేమ వ్యవహారం అంటే పరమ భయం అతడికి. అందులోనూ వేదాంతికాబట్టి తనగొడవ కాదనుకొని మళ్ళీ అట్లు పోసే ప్రయత్నంలో ఉన్నాడు. కాని ఆఖరు సలహామాత్రం ఇచ్చి ఊరుకున్నాడు. "ప్రేమ విఫలమైతే ఆత్మహత్య చేసుకోవాలి, లేకపోతే సినిమాహాలువద్ద అట్లు పోసుకోవాలి" అని.

జానకిరామయ్య మరో అట్టుతినలేదు. సినిమా చూడబుద్ధయలేదు. నేరుగా పెద్ద బజారుపై పడనుస్తా రోడ్డు లైటువంక చూస్తూ మధ్యలో ఓపాదాతాగి ఇంటికొచ్చిపడ్డాడు. మంచంమీద పడుకుని ఇంటి చూరు కేసి చూస్తూ అలా ఉండిపోయాడు.

మర్రోజు జానకిరామయ్య ఇంటిముందు కొంతజనం పోగడ్డారు. అతడు ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నించాట్ట. కాని అది విఫలమయింది. బతికాడుకాని చావుబతుకులమీద ఉన్నాడు.

నాలుగ్రోజులకు కాస్త కుదుటపడింది జానకిరామయ్య పరిస్థితి. "ఇప్పుడతడు మునుపటి కల్లమొద్దుకాదు, తనూ ఓ వేదాంతి. సలహాలకోసం కోదండాల దగ్గరకు పరుగెత్తే రోజులు దాటిపోయినై, తనే స్వయంగా ఆలోచించుకోగలడు. సలహాలివ్వగలడు.

ఓ రోజు చూరుకేసి చూస్తూ పడుకున్న జానకిరామయ్యకు ఓ ఆలోచన తట్టింది.

ఒళ్ళంతా చమటలు పోసినై. అదో విధమైన ఆనందం బయలుదేరింది— తానెందుకు దేశాటన చేయకూడదు? దేశాటనవల్ల విజ్ఞానం తనంతట తానే వచ్చిపడుతుంది. ఈ ఆలోచన తట్టిన జానకిరామయ్య ఇంక ఉండబట్టలేక పోయాడు. తను దేశాటన చేసితీరాలి. విజ్ఞానం సంపాదించాలి. లేచి హుషారుగా బీడీ వెలిగించాడు. వెంటనే ఎవరో చాచి కొట్టినట్టయింది—తను ఎలా ఊళ్ళు తిరగగలడు? చేతిలో దమ్మిడీ లేదే?

కాని దీన్ని గురించి ఎక్కువ ఆలోచించలేదు. రైళ్ళు ఉన్నయ్. టికెట్ కొనకపోయినా ఎక్కవచ్చు. అంతగా అయితే దింపేస్తారు. అది మరీ మంచిది. దింపేసిన ఊరుగూడ చూడవచ్చు. మద్రాసునుంచి కలకత్తా పోయేవాడికి ఒక మద్రాసు కలకత్తా మాత్రమే తెలుసు. కాని తనకు తనను దింపేసిన ప్రతి స్టేషనూ ప్రతి ఊరూ తెలుస్తయ్. అది మరీ విజ్ఞానం. గుండెలు బాదుకున్నాడు జానకి రామయ్య. వెంగనే ముఖం కడిగేసుకుని ఏవో తీయటి కలల్తో నిద్రపోయాడు.

మర్నాడు రాత్రి హైదరాబాద్ పాసింజరులో ఓ మూడవతరగతి పెట్టెలో మూలగా ఓ చిన్న సంచితో కూర్చుని ఉన్న జానకిరామయ్యకు ఓ సందేహం కలిగింది. తను చేస్తున్నది రైటా తప్పా? ఏమోలే అనుకున్నాడు—అయినా తనకు టైపువచ్చు కదా—ఏదో చిన్న ఉద్యోగం చూసుకుని తనున్న ఊళ్ళోనే ఎందుకు పడుండకూడదు. తనకు నా అనేవాళ్ళు లేరుకదా—తనెవర్ని పోషించాలి? గృహమేకదా స్వర్గసీమ వ్యవహారం తనకు లేదు. వచ్చిందాంట్లో కలో గంజో తాగి పడుండవచ్చు. కాలం దొర్లిపోతుంది. దానికేం — హాయిగా ఉండొచ్చు. అటువంటిది తనీ రైలుపెట్టెలో ఎందుకు పడుండాలి?

భోరున ఏడుపు పొంగుకొచ్చింది జానకిరామయ్యకు. పెద్దగా రాబోయే ఏడుపును అదిమివేశాడు. నిప్పు కణాల్లా ఉన్న కళ్లను తుడిచేసుకున్నాడు. "అయిందేమో అయింది. రైలు కదిలింది. నిరుత్సాహం ఎంతమాత్రం పనికిరాదు. చావో బతుకో—" అని తనకు తాను ధైర్యం చెప్పుకున్నాడు.

నిద్ర ముంచుకొచ్చింది. అలా కూర్చునే నిద్రపోయాడు జానకిరామయ్య. పెట్టెఖాళీ అవడంతో తనకు తెలియకుండానే కాళ్ళు చాచేసుకుని నిద్రపోయేడేమో తను లేచేసరికి ట్రైన్ సికింద్రాబాద్ స్టేషన్లో ఆగివుంది. తనను నిద్రలేపి ఎవరూ టికెట్ అడగనందుకు మొదటిసారిగా భగవంతుడు గుర్తుకొచ్చాడు. ఫరవాలేదు భగవంతుడు మంచివాడే అనుకున్నాడు. ఇప్పుడు తనను ఊళ్ళో పడేస్తే మరీ మంచివాడు.

భగవంతుడు నిజంగా మరీ మంచివాడు. తను నిజంగా ఏ ఆటంకం లేకుండా సికిందరాబాద్ రోడ్డుమీద నడుస్తున్నాడు. చేతిలో సంచీకూడ వుంది. వెయ్యి ఏనుగుల బలం వచ్చింది. జేబులో ఓ రూపాయిపైన మూడణాలకాని వుంది. ముందు టీ తాగాడు. తాగుతూనే ఆలోచించాడు. ఇహ తన ముందు కార్యక్రమం ఏమిటి? జవాబు దొరకలేదు. అయినా మళ్ళీ ఆలోచించాడు.

ఒక్కమాటు అతడి కళ్లు మెరిసినయ్. ఆనందంతో ఊగిపోయాడు. తన చిన్ననాటి మిత్రుడు తోటి విద్యార్థి అయిన ముకుంద రావు ఆ ఊళ్ళోనే ఏదో ఎలక్ట్రిక్ కంపెనీలో ఉన్నట్టు గుర్తుకొచ్చింది. గబగబ నడిచాడు. ముందు ఎలక్ట్రిక్ కంపెనీ ఆరా తీయాలి. ముకుందాన్ని కలుసుకోవాలి. ఆపైన తన కార్యక్రమం ఆలోచించాలి.

సాయంత్రానికి సాధించాడు. ముకుందాన్ని కలుసుకున్నాడు. జానకిరామయ్య తనను కలుసుకోడం ముకుందానికంత నచ్చలేదు. "ఏం కథ" అన్నాడు.

"అబ్బే ఏం లేదు వూరికే చూసిపోదామని" అన్నాడు జానకిరామయ్య.

ఆ జవాబు ముకుందం నమ్మలేదు. ఎందుకంటే జానకిరామయ్య చేతిలో సంచీ మాసిన గుడ్డలు, గడ్డం, ఊరికే చూసిపోయేందుకు వచ్చిన వ్యవహారంకాదు అనుకున్నాడు. పైకి నవ్వాడు ముకుందం "ఎలా, ఏం జేయడం" అని లోపల దిగులు పడుతూ.

"చాల మంచిది ఎక్కడ ఉంటున్నావ్, ఈ వూళ్ళో?" అని పరామర్శించాడు.

"అబ్బే, ఏదీ, ఇంకా ఏది లేదు? ఇదే రావడం నిన్ను చూద్దామని."

ముకుందానికి గుండెల్లో రాయిపడింది.

"ఏం, ఎందుకు?" అన్నాడు.

"ఏదన్నా ఉద్యోగం సంపాదించి పెట్టగలవూ? నాకు టైపు వచ్చు." అన్నాడు జానకి రామయ్య చాల త్వరగా. "పోనీ, టైపు ఉద్యోగం కాకపోయినా ఫరవా లేదు. మరేదైనా సరే." అని కూడ అన్నాడు.

ముకుందానికి చిరాకేసింది. ఒక రకం భయం పుట్టుకొచ్చింది. ఓ వేళ ఈ జానకి రామయ్య ఉరఫ్ వల్లమొద్దుకు ఉద్యోగం లేకపోతే తనను వదలడేమో. ఇవాళ పొద్దుటే లేచి మొదటిసారిగా చూసిన గడ్డం సాయిబును పదేపదే తిట్టుకున్నాడు. సరే చూద్దాంలే అన్నాడు.

వారం రోజులు తనమీద పడిన వల్లమొద్దును ఎలాగో భరించి ఆఖరికి తన కంపెనీలో ఓ చిన్న ఉద్యోగం సంపాదించి పెట్టాడు. నెలకు ముప్ఫై అయిదు రూపాయిలు ఇస్తారు.

జానకిరామయ్యకు ఆనందం వేసింది.













Rexona
BLENDED WITH CADYL



# ఉమ్మెత్త పువ్వు



తను కూడ సంపాదించ గలడు. నెలకు ముప్పై అయిదు రూపాయలు! హోటలూ-తనకు ఇరవై కన్న ఎక్కువ ఖర్చుకాదు. మిగతా పది పోస్టాబాంకులో వేయవచ్చు. కొన్నాళ్లలో లేక కొన్ని సంవత్సరాలలో బోలెడంత డబ్బు మిగులుతుంది. ఆ పైన ఇహ ఉద్యోగం చేయనక్కర లేదు. ఓ చిన్న ఇల్లుకూడ కట్టుకోవచ్చు. అప్పుడు టికెట్ కొని దేశాటన చేయవచ్చు. బోలెడంత డబ్బు మరి.

జానకిరామయ్యకు నవ్వు వచ్చింది. కళ్ళంట నీళ్లు తిరిగినై ఆనందంతో.

ఉద్యోగంలో చేరాడు. మొదటిరోజు మహా హుషారుగా ఉన్నాడు. సాయంత్రం ముకుందంరూముకు వచ్చి సిగరెట్ వెలిగించాడు, మొదటిసారిగా సిగరెట్ కాల్చడం అదే.

వారం రోజు లయింతర్వాత ఓ రోజు రామయ్య బీడీ కాలుస్తూ ముకుందం గది కొచ్చాడు. ఆ రోజు ముకుందం ఆఫీసుకు పోలేదు. సెలవుపెట్టాడు. జానకిరామయ్య మామూలు మనిషిగా ఉన్నట్టు తోచలేదు ముకుందానికి. ఏమిటి అలా ఉన్నావే అన్నాడు.

జానకిరామయ్య తడబడుతున్నాడు. "వాడెంత.—వాడి ఉద్యోగమెంత—నేనూరుకుంటానా—వాడో పెద్దని వాడి ఉద్దేశం—ఏం—నేనూ అంతే—నేనూరుకుంటానా—"ఇంకా తిట్టుకుపోతున్నాడు.

ముకుందానికి భయమేసింది. గడ్డంసాయిబును మళ్లీ తిట్టుకున్నాడు. కొంత తెమాయించుకుని ఏం జరిగింది అన్నాడు.

"వాడు గొప్పయిత్తే వాడికే గొప్ప. నేనూరుకుంటానా — స్కౌండ్రల్ అంటాడూ—మళ్లీ అన్నాను. ఇంకేదో అన్నాడు—చంపుతానన్నాను—అంతే—ఇహ చస్తే వాడిముఖం చూడను." అన్నాడు జానకిరామయ్య ముకుందం మొఖంకేసి చూడకుండా.

ముకుందానికంతా అర్థం అయింది. ఇహ దాన్ని గురించి చర్చించ దలచుకోలేదు. పైవాడు ఏదో అనుంటాడు. జానకిరామయ్యకు అభిమానం ముంచుకొచ్చి ఉంటుంది.

ఆ రోజు రాత్రి భోంచేసి బీడీ కాలుస్తూ పడుకున్న జానకిరామయ్యకు కొత్తరకం ఆలోచనలు మొలకెత్తినయ్. హైదరాబాదు అంటే అసహ్యం పుట్టుకొచ్చింది. ఈ "ఊళ్లో పక్కవాడంటే గిట్టదు. ఆఫీసర్లకు క్రింది వాడంటే అసలు గిట్టదు. "స్కౌండ్రల్" అంటారు. ఏం—వాడు ఆఫీసరయితే స్కౌండ్రల్ అనాలా?—నువ్వీపని సరిగా చేయలేదు అనవచ్చుగా—ఎంత లేకపోతేమటుకు మాటలు పడతామా—అసలీ ఊరంటేనే అసహ్యం పుడుతున్నది."

ఆ రాత్రి కలత నిద్రపోయాడు.

మర్రోజు మద్రాసు వెళ్లే ఎక్స్‌ప్రెస్‌లో ఓ మూడవ తరగతి పెట్టెలో మూలగా ఓ చిన్న సంచీతో కూర్చున్న జానకిరామయ్య తన వెనుకటి జీవితంగురించి ఆలోచించటం లేదు. ముందు కార్యక్రమంకూడ ఆశే పట్టించుకోలేదు. తను రేపటికి కాకపోతే కనీసం పదుహేనురోజులకన్నా మద్రాసు వెళ్ళితీరతాడు. తర్వాత సావధానంగా అన్నీ ఆలోచించుకోవచ్చు. మద్రాసులో డబ్బు సంపాదించే మార్గాలు బోలేడు ఉన్నాయట. అక్కడికి వెడితే కాని ఏదీ వీలుకాదు. వెళ్ళి ఆలోచించుకోవచ్చు. కొన్ని లక్షలమంది బతుకున్న మద్రాసులో తనూ బతకలేక పోతాడా—ఖచ్చితంగా ఎంతో కొంత సంపాదిస్తాడు.

జానికిరామయ్యకు ఓ అవ్యక్తానందం పుట్టింది. ఆరిపోయిన బీడీని మళ్లీ వెలిగించి ఘట్టిగా ఓ దమ్ములాగి అలాకూర్చునే నిద్రపోయాడు.

మరుసటి రోజు టికెట్ లేనందుకు తన్ను గూడూరు స్టేషన్లో దింపేసిన టికెట్ కలెక్టరును నానా తిట్లూ తిట్టుకున్నాడు జానకిరామయ్య. తను బాగుపడేందుకు మద్రాసు వెడుతున్నాడు. కూలోనాలో చేసుకుని బతుకుతాడు. అటువంటిది ఏంబావుకుందామని తనను దింపేయటం? ఎంతమంది టికెట్ లేకండా వెళ్లటంలేదు. మద్రాసు వెళ్లాలి. డబ్బులేదు. మరేం చేయటం-టికెట్ లేకుండా వెడితే వీళ్ల సొమ్మేం పోయింది! డబ్బుంటే ఓ యాభై టికెట్లు కొని పారేసును.

వళ్ళు మండింది జానకిరామయ్యకు. వచ్చే జన్మలోనన్నా తను టికెట్ కలెక్టరై వీళ్లని జానకిరామయ్యలను చేసి అదే గూడూరు స్టేషనులో దింపేయాలి!-పగబట్టాడు జానకిరామయ్య. అయినా ఏంపరవాలేదు-గూడూరులోనే ఉండి పోతేనేం? తను మద్రాసులో చేసే పని గూడూరులోనే చేయవచ్చుగా.

కాని జానకిరామయ్య ఉండబట్టలేక పోయాడు. ఆ రోజు తెల్లవారుఝామున మద్రాసుపోయే పాసింజరులో ఎక్కాడు. ఈ సారి టికెట్ల ఆసామీకి కనబడకుండా ఉండే ఏర్పాట్లు ముందే ఆలోచించుకున్నాడు. స్టేషన్ వచ్చినపుడు దిగిపోవటం ట్రైన్ కదలుతున్నప్పుడు బల్లక్రింద పడుకోటం మొదలైనవి.

తను వేసిన ఎత్తుపారింది. ఏ ఆటంకం లేకండా పొద్దున పదిగంటలకు మద్రాసు రోడ్లమీద నడుస్తున్నాడు జానకిరామయ్య. ఓ మాటు సంచీకేసి చూసుకున్నాడు. రెండు జతల బట్టలూ ఓ రేజరూ, మూడుసార్లు గీసేసిన బ్లేడూ, ఓ తువాలూ—అన్నీ సక్రమంగానే ఉన్నయ్. జేబులో కొంత చిల్లర ఉంది. ఐదారు బీడీలు—సగం అయిపోయిన అగ్గిపెట్టె—అన్నీ పద్ధతిలోనే ఉన్నయ్. బాగుంది అనుకున్నాడు. గుడ్డలుమాసి కంపు కొడుతున్నట్టుతోచింది అతడికి. ముందు స్నానం చేయాలి. ఎక్కడ?

నడుస్తున్న జానకి రామయ్యకు ఒకచోట వీధి పంపు కనబడింది. బాగుంది అనుకున్నాడు. స్నానం చేశాడు. ఉతికినబట్టలు కట్టాడు.

హుషారుగా నడుస్తున్న జానకిరామయ్యకు హైదరాబాద్‌లో కన్న మద్రాసులో కార్లు ఎక్కువ ఉన్నట్టు తోచింది. దీన్నిబట్టి హైదరాబాద్ కన్న ఇక్కడ

 ఉమ్మెత్తపువ్వు 

డబ్బున్నవాళ్ళ సంఖ్య ఎక్కువగా ఉండి తీరాలి. ఇంతమంది డబ్బున్న వాళ్లు ఉండబట్టే ఇన్ని కార్లు!

రోడ్డు అటూ ఇటూ చూస్తూ నడుస్తున్నాడు, అడ్వర్ టైజ్ మెంట్లూ, సినిమా పోస్టర్లే ఎక్కువగా ఉన్నట్టు తోచింది. ఈ ఊళ్ళో సినిమాలు తీస్తారట. అసలు అన్నీ సినిమాలుతీసే స్టుడియోలే. అన్నీ కార్లే. ఈ కార్లన్నీ సినిమా వాళ్లవే అయి ఉంటాయి. సినిమాలో వాళ్లకి బాగా డబ్బు ఉంటుంది. చిన్న వేషం వేసినా వందల కొద్దీ రూపాయలు వస్తాయని ఎప్పుడో కోదండం అన్నాడు—తను వేషం వేస్తేనో! నిమిషాల మీద వందలు గడించవచ్చు. వెధవ ఉద్యోగాలు ఎన్ని చేసినా వందలువస్తాయా! తొందరలో డబ్బు సంపాదించేందుకు సినిమా ఒక్కటే మార్గం—ముందు స్టుడియో ఎక్కడో ఆరాతీయాలి. వేషం వేయటం ఏదో నేర్చుకోవాలి—తనకేం—నల్లగా ఉన్నా బాగానే ఉంటాడు—రంగు పులిమితే అందరూ తెల్లబడతారు.

సాయంత్రానికి సాధించాడు. స్టుడియో ఎక్కడ ఉందో కనుక్కున్నాడు. వేషం ఇస్తారా అని గేటువాణ్ణి కనుక్కున్నాడు. "చలో, చలో" అని కసిరాడు గేటువాడు. టికెట్ కలెక్టరు మీద వచ్చినంత కోపం వచ్చింది గేటువాడి మీద. అసలు వీళ్లిద్దరూ అన్నదమ్ములయుండాలి-ఎటొచ్చీ వాడు తెల్లకోటూ; పాంటూ—వీడు కాకీకోటూ నిక్కరూ- ఎవడూ బాగుపడటం వీళ్లకు ఇష్టంలేదు.

ఇంకో స్టుడియో కనుక్కున్నాడు. ఇలాంటివే చాలా ఉన్నాయట ఈ ఊళ్లో కాని ప్రతిచోటా కాకీకోట్లు ఎదురైనై.

ఓరోజు ఓ కాకీకోటుని ఎదుర్కొని తిరిగి వస్తున్న జానికిరామయ్యకు ఓ ఆసామీ కనబడ్డాడు. ఇతణ్ని చూడంగానే "ఏ సినిమాల్లో వేషం వేయటానికి వచ్చావా" అన్నాడు. అవునని తలూపాడు జానికిరామయ్య.

అయితే నాతో రా అన్నాడు ఆసామీ.

ఆసామీ పేరు ఆనందం.

ఎప్పుడూ నవ్వుతూంటాడు.

అంటే జానికిరామయ్యనుచూసి నవ్వాడు.

సినిమాల్లో వేషాలిప్పించడం అతనివృత్తి.

నాలుగోరోజు జానికిరామయ్య ఓ సినిమాలో వేషం వేశాడు. కొన్ని వందలమంది ఉన్నారు తనతోబాటు వేషం వేసుకుని. అందర్నీ కలియబడమన్నాడు కెమేరా వెనకాల కూచున్న కళ్లజోడు మనిషి.

కొట్లాటలో తను పదిమందిని చితకబాదాడు. తన వళ్లూ హూనం అయింది.

సాయంత్రానికి తనకు ఐదురూపాయలిచ్చారు. ఆనందం వేసింది జానకిరామయ్యకు. కాని అందులో రెండురూపాయలు ఆనందానికివ్వాలి తనకు వేషం ఇప్పించినందుకు. తన వళ్ళు హూనం అయింది. తనెందుకు ఆనందానికివ్వాలి అనితోచింది కాని ఇచ్చేశాడు.

మళ్ళీ రెండురోజుల తర్వాత ఓ వేషం వేశాడు ఈసారి తనకూ తనలాగే మరి కొందరికి ఇవ్వమని ఆనందాని కిచ్చారట డబ్బు. కాని ఆనందం తనకివ్వలేదు. వళ్ళు మండింది జానకిరామయ్యకు. అది ఎలాగేనా రాబట్టాలి. ఓసారి కలుసుకుని అడిగాడు. రెండు మూడు రోజుల్లో ఇస్తానన్నాడు ఆనందం.

ఓరోజు జానకిరామయ్య మాంబళం స్టేషను ముందు నుంచుని వున్నాడు. జేబులో అర్థణా వుంది. తిండితిని రెండు రోజులైంది. త్వరగా ఇప్పుడు ఈనిమిషాన డబ్బు కావాలి. ఎలా ?

ఎదురుగుండా పెద్ద పెట్టెతో వస్తున్న ఆయనవైపు అప్రయత్నంగా నడిచాడు. అప్రయత్నంగా పెట్టెను అందుకున్నాడు. బస్ స్టాండుదాకా నడిచాడు. ఆయన మూడణాలు ఇచ్చాడు. మళ్ళీ తల ఎత్తకండా గబగబ నడిచాడు జానకిరామయ్య.

ఆ తర్వాత ప్రతిరోజూ ఏదో సమయాన మాంబళం స్టేషన్ వైపు రావటం జరుగుతున్నది జానకిరామయ్యకు. స్టేషన్‌కు వెళ్ళడం ఎంత మాత్రం ఇష్టంలేదు—కాని వెళ్ళకపోతేఎలా?

ఆనందం తనకు రెండు సినిమాలకు బాకీ. పైగా ఇంకో రెండుమూడు రోజులలో ఇంకో పిక్చర్ ఉందంటున్నాడు. మూడింటికీ కలిపి ఏకంగా ఒకేమాటు ఇస్తానంటాడు. ఇచ్చేదాకా తను బతకాలి. స్టేషనుకు వెడితే ఓమాదిరిగాబతకవచ్చు. కనుక స్టేషనుకువెళ్ళాలి.

ఓరోజు అర్ధరాత్రి మాంబళం స్టేషనులో బల్లమీద చలిలో పడుకుని బీడీ కాలుస్తున్న జానకిరామయ్యకు తనజీవితంమీద అసహ్యం వేసింది. కోదండం గుర్తొచ్చాడు—వాడి పనే బాగుంది. ఉన్న ఊళ్ళో పడున్నాడు. ఏం చేద్దామని తనీ ఊరు వచ్చినట్టు? తను అంతో ఇంతో చదువుకున్నాడు గదా—టైపుకూడా వచ్చు—అయినా తను చేస్తున్న పని ఏమిటి? తన చదువూ, టైపూ—ఇప్పటి తన పరిస్థితి—ఏమాత్రం సంబంధం లేదు. తనెందుకిలా అయినాడు. ఎందుకు బ్రతుకుతున్నాడు? ఏం చేద్దామని? కడుపు దహించుకు పోవడం తప్ప ఇంకేమి ఎరుగడు తను. తన యాత్రలవల్ల విజ్ఞానం ఏమీ వంటబట్టడం లేదు. అసలు చిన్నప్పుడే చేగోడీలు మానేసి చదివి వుండాల్సింది. పోనీ ఏదేనా ఉద్యోగం చూసుకుని తన ఊళ్లోనే వుండాల్సింది. ఎవరో ఒకరు అంతో ఇంతో సాయపడే వారు. కాని తను ఈ చలిలో ఈ బల్లమీద ఎందుకు పడుండాలి. కడుపు దహించుకు పోతూ ?—

కెవ్వున కేకేశాడు బాధతో. కాని పైకి వినిపించలేదు—కుమిలి కుమిలి ఏడ్చాడు.

తను చచ్చిపోతేనో—రైలు కింద పడితేనో—

* * *

కాని అన్ని కథల్లోలాగా జానకిరామయ్య చచ్చిపోలేదు. ఆత్మహత్య అంతకన్నా చేసుకోలేదు. దేనికోసమో యెదురు చూస్తూ, పడుతూ లేస్తూ, కెవ్వున కేకలు వేస్తూ సజీవంగానే వున్నాడు. 




# పంచ తంత్రము

లోని అయిదవ భాగము...

# అసంప్రేక్ష్యకారిత్వము

గేయరచన
నండూరి
రామమోహనరావు

...బొమ్మలు...
బాపు

## మా అభిమానులకు

## శుభవార్త!

విశ్వసాహిత్యంలో వినోద విజ్ఞానాలకు విఖ్యాతిపొందిన విశిష్టగ్రంథం పంచతంత్రం. పంచతంత్రంలోని మొదటి నాలుగు భాగాలను లోగడ ఆంధ్ర వారపత్రికలో బొమ్మల కథలుగా లక్షలాది పాఠకులకు అందజేశాము. ఆ కథలకు ఏ విధంగానూ తీసిపోని అయిదవ భాగం "అసంప్రేక్ష్యకారిత్వం" [అనాలోచితముగా పనిచేయుట] బొమ్మల కథ త్వరలో సీరియల్‌గా ప్రకటించబోతున్నాము ఈ సీరియల్ కూడా మా పాఠకులను రంజింపచేయగలదని విశ్వసిస్తున్నాము.



# బుడుగు! చిచ్చులపిడుగు

యెలాగ మరి?

ఉంగరం బూచాడేమో అలా విడిచేశాడు. అప్పుడు అలాడీనుకి ఛాలా జాలివేసింది. యేడవకమ్మా బూచాడూ అన్నాడు. కుంచెంసేపు అయ్యాకానేమో, ఉంగరం బూచాడు నవ్వేసి, పోనీ యీ గ్రుహాని మీ యింటిదగ్గిరికి తీసుకెళ్లిపోనా అన్నాడు.

కాని అప్పుడుమాత్రం ఎలా, గ్రుహా తలుపులు రావుగా. నేను ఇందులోనే ఉండిపోవాలీ యీాయీా అని ఏడిచాడు అలాడీను.

హాఁ హాఁ అదా అన్నాడు బూచాడు. నేను తలుపులు తియ్యలేను కాని, నిన్ను యీ గ్రుహా లోంచి అవతలికి తీసుకెళ్లగలను తెలుసా అన్నాడు వాడు.

అవును తెలుసు కాని మరిచిపోయానులే, మరి తీసుకెళ్ళు చెప్పానీ అన్నాడు అలాడీను.

ఫ్యాష్ మూంకాళీ అనేసరికి యిద్దరూ గ్రుహా అవతలికి వెళ్లిపోయారు.

ఇప్పుడు మీ యింటిదగ్గిరికి తీసుకెళ్లిపోనా అని అడిగాడు బూచాడు.

ఏం ఒద్దులే, ఒక నిఝుం జెటకా తెచ్చిపెట్టు చెప్తాను అన్నాడు అలాడీను.

అప్పుడేమో ఆ జెటకా ఎక్కి వాడే తోలుకుని ఝూంమని వాళ్లింటికి వెళిపోయాడు.

తరవాత మళ్ళీ ఉంగరం బూచాడిని పిలిచి కాసిని ఛాలా పకోడీలు తేరా అన్నాడు. హూష్ మంకాళి అనేసరికి బోల్డు పకోడీలు వచ్చేశాయి.

పురేయి బూచాడూ, పకోడీలు తెచ్చావని మా బామకి చెప్పకేం





“అలాడీను జెటకా ఎక్కి గ్రుహానించి ఝూంమని వెళిపోయాడు.”

చెప్పితే నడ్డిమీద ఛంపేస్తాను జాగర్త అన్నాడు అలాడీను.

సరేండి చెప్పను అన్నాడు బూచివాడు.

మరి యిప్పుడేంచెయ్యాలిరా నేను? అని అడిగాడు అలాడీను.

మరి యిప్పుడేమోనూ మరే మోనూ ముందస్తుగా సోడా తాగేసి అప్పుడేమో, రాజుగారి అమ్మాయిని పెళ్లిచేసుకోవాలండి అని చెప్పాడు బూచివాడు.

హుం అన్నాడు అలాడీను. హుం అన్నాక, పు రేయి బూచివాడూ దాని పేరేమిట్రా అన్నాడు.

సీ గాన పెసూనాం బండి అని చెప్పాడు బూచివాడు.

సరేని అలాడీను పరిగేరుకుని సీ గానపెసూనాంబా వాళ్లింటి కెళ్లిపోయాడు.

అక్కడ రాజుగారు కూచునాడు.

యావండీ మరీ యిప్పుడూ నేనేమోను మిా సీ గానపెసూనాంబని పెళ్ళిచేసుకోవాలండీ అని చెప్పేశాడు అలాడీను.

ఫోకిరీ వెదవకానా ఫోరా ఫో అనేశాడు వాళ్ళనాన్న. వాడు రాజుగారుగదా.

అప్పుడు అలాడీను, పరిగేరుకుని మళ్లీ జెటకాదగ్గిరికి వచ్చేశాడు.

అప్పుడేమో వుంగరం బూచివాడిని మళ్ళీ పిల్చి యేలాగరా అన్నాడు.

మరేమోండీ నాకు తెలీదండి ఈ అరికినులాంతర్ని గోకండి అని చెప్పాడు ఉంగరం బూచాడు.



నీకు చదువులేదుగా. జెటకా ఉందిగా. అది తోలుకోఫో అన్నారు రాజుగారు.

## ★ బుడుగు! చిచ్చుల పిడుగు! ★

సరేనని పాపం అలాడీను అరికీను లాంతర్ని యిలా గోకాడు. బేద్ధ బూతంవాడు వచ్చేశాడు. ఇలా గాఠిగా పొడుగ్గా నవ్వేసి యేం శావాలి అన్నాడు.

అలాడీనుకి కుంచెం బయిం వేసింది. వురేయి మాబామ్మ వింటే మనిద్దరికీ ప్రెవేటు చెప్పేస్తుంది. కుంచెం మెల్లిగా నవ్వు. అసలు నువ్వు ముందస్తుగా యింత చిన్న వాడివి అయిపో. నాకే బయిం వేస్తుంటే అన్నాడు అలాడీను.

అప్పుడేమో తన ఖద చెప్పి, ఎలాగరా అన్నాడు. బూతంవాడు మెల్లిగా పొట్టిగా ఇంతకుంచెంనవ్వి, మీరు బెద్దవాడుఅవాలండీ▒లాపోతె పెళ్ళిచెయ్యరు రాజుగారుఅన్నాడు.

సరే నన్ను బెద్దవాడు చెయ్యరా అన్నాడు అలాడీను.

వుష్ మాంకాళీ అనేప్పటికి ఘుబుకుని బెద్దవాడైపోయాడు.

ఇప్పుడు మీ జేబునిండా ఫదికాణీ లుండాలండి. ఇంకానేమో నిఝుం జెటకా, ఓ పేయే యేద్ధ మేడకూడా ఉండాలండి అని చెప్పాడు బూతంవాడు.

అవన్నీ వచ్చేశాక, అలాడీనేమో రాజుగారింటికి మళ్ళీ వెళ్ళి రాజుగారి అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలీ అన్నాడు.

రాజుగారు హాచెర్యపడిపోయేసి మరి నీ దగ్గిర యెన్ని డబ్బులు ఉన్నాయి అన్నారు.

నాదగ్గిర ఫ్ఫదికాణీలు ఉన్నాయి తెలుసా? అన్నాడు అలాడీను. ఆబ్బ, అన్ని కాణీలే అన్నాడు రాజుగారు.

ఇంకో నిజెం జెటకా కూడా ఉంది తెలుసా. కొరడా, బీడీలూ, ఒక బేద్ద మేడా కూడా ఉన్నాయి అన్నాడు అలాడీను.

రాజుగారు ఇంకా ఛాలాసేపు హాచెర్యపడిపోయేశారు.

అపుడు సరేని సీగానపెసూనాంబకి పెళ్ళి చేసేశారు. బోల్డు బోల్టు బాజాలూ అవీ వచ్చాయి.

కాని ఏం చేశారంటే సీగానపెసూనాంబ ఒకర్తికే పెళ్ళిచేశారు.

మరి నాకో అన్నాడు అలాడీను పాపం.

నువ్వు బళ్ళోకి వెళ్ళవుగా. నీకు జెటకా వుందికా అది తోలుకోఫో అన్నాడు రాజుగారు.

(అప్పుడు బుడుగుకి కోపం వచ్చి,)

# మరపురాని వసంత

కృష్ణమూర్తి వరండాలోని పడకకుర్చీలో కూర్చుని ఏదో పుస్తకం చూస్తున్నాడు. సాయంత్రం 5 గంటల ప్రాంతం. మబ్బు పట్టటంచేత ఎండ అప్పటప్పుడు వస్తూపోతూ ఉంది. చల్లని గాలి వీస్తూంది. వాతావరణం, ఎంతవయస్సు మళ్లినవాళ్ళకైనా గిలిగింతలు పెట్టగలిగేంత ఆహ్లాదకరంగా వుంది. ఆసమయంలో ఎంతవాడికైనా వినువీధిలో విహరిద్దామని మనస్సు ఉరకలువేస్తుంది. ఇంతలో 'గలగల'మని మూవలచప్పుడూ, డమరుకనాదమూ, సజ్జివాళ్ళ అల్లరి కృష్ణమూర్తిచదువుకు అంతరాయం కలిగించినయ్.

"బాబుగారికి దండాలు. అంబాపలుకు, జగదంబాపలుకు—అయ్యగారికి రాజయోగముంది! బాబూ, భవిష్యత్తు చెప్తాం."అంటూ ఓ బుడబుక్కలవాడు ప్రవేశించాడు. కృష్ణమూర్తికి చికాకువేసింది. ఈ జ్యోతిషాలూ, మంత్రాలూ అంటే అసలే నమ్మకం లేకపోగా ఇటువంటివాళ్ళనిచూస్తే ఒళ్ళు మండుతుంది. ఒళ్లువంచి పనిచేయలేని సోమరిపోతులందరూ ఇలా వేషాలు వేస్తూంటారు.

"ఏయ్! ఏమీఅక్కర్లేదు గాని ఈఅణా పుచ్చుకుని బయటికినడు." విసుగ్గా అణా ఇవ్వబోయాడు.

"బాబూ! ఉన్నదున్నట్టుగా నిజం చెప్తాం! జోస్యం చెప్పించుకోండి." అని ఎంతవద్దన్నా వినకుండా బలవంతం చేయసాగాడు.

"సరే! లేనికూతలు కూశావంటే నాలుగు తగిల్చిచ్చి బయటికి గెంటేస్తాను. చెప్పేదేమిటో చెప్పు" అంటూ కుర్చీలో కూర్చున్నాడు మళ్లీ. కృష్ణమూర్తిచెయ్యిని పట్టుకుని ఓసారి పైకీక్రిందకీ త్రిప్పి "అంబాపలుకవే!" అంటూ ప్రారంభించి, మరోసారి జగ్గు వాయించి "అయ్యగారికి రాజయోగముంది!" అన్నాడు.

"భవిష్యత్తలాఉంచి గతంలోకి దిగు. సరిగాఉంటే నే నీబహుమానం. లేకుంటే.." అన్నాడు మూర్తి.

"అంబాపలుకు. నిజంపలుకు! అయ్యగారి వయస్సిప్పుడు 35 సంవత్సరాలు." "ఇంత వరకునిజమే. ఈవిషయం వీడేచెప్పాలా! లౌకికం తెలిసిన ప్రతివాడూ ముఖంచూసి అట్టేచెప్పేస్తాడు" అనుకున్నాడు. "అయ్యగారికిసరిగా 23 సంవత్సరాల వయస్సున్నప్పుడు ఒక పెద్దజలగండం తప్పింది" నిజమే. తనోసారి షికారువెళ్తుండగా కాలుజారి మోటబావిలో పడ్డాడు. శంకరావు లేకపోతే తను ఈవరకు ఏస్వర్గలోకంలోనో ఉండేవాడు. తనకింతవరకూ ఈతరాకపోవటం సిగ్గనిపించింది. "ఊఁ! తర్వాత?" అన్నాడు ఈవిషయం కాకతాళీయంగా నిజంకావచ్చు గదా అనుకుని.

"బాబుగారు ఒకసారి"అని ఆలోచిస్తూ "సరిగా పన్నెండుసంవత్సరాల క్రితం ఒక ఊరినుంచి కాలినడకను వస్తూంటే దారిలో నాగుకరచి చచ్చిబ్రతికారు."

"ఘటికుడిలా వున్నాడే! ఉన్నదున్నట్టు తేదీలతోసహా చెప్పేస్తున్నాడు," అనుకున్నాడు-అయినా ఈజోస్యాన్ని నమ్మితే

ఉమాపతి పద్మనాభశర్మ

తన M.Sc కి నామోషీ అనుకుని వినోదంగా వాడు చెప్పేది వింటున్నాడు-

"నిజమేనా బాబుగారు?" అని గద్దిస్తున్న ధోరణిలో గుడ్లులావుగా తెరచి జగ్గు వాయించాడువాడు. బాబుగారు ఉలిక్కిపడి నిజమేనని ఒప్పుకున్నారు. "ఇంకా చెప్తాను. అంబా పలుకవే! జగదాంబ చెప్పవే! బాబుగారికి కోపం రాదంటే ఇంకో నిజం చెప్తాను."

కోపమెందుకొస్తుంది? కొంపదీసి నేడోరేపో చచ్చిపోతానని చెప్పడుగదా" అని భయపడ్డాడు. కాని వెంటనే తనకు పట్టబోయే 'రాజయోగం' సంగతి జ్ఞాపకమొచ్చి చెప్పమన్నాడు. అయినా వీడింత పచ్చినిజాన్ని ఎలా చెప్తున్నాడా?నమ్మక తప్పేట్టు లేదే! ఉత్సాహంగా "చెప్పేసెయ్-కోపమేమీ రాదులే" అన్నాడు. "అయ్యగారికి కోపం రావద్దు. జగదాంబ పలుకు..." అంటూ ఇంకా ఏమేమో వాగుతూ రెండు మూడు నిమిషాలు గడిపాడు. "నేనవసన్పెన్సులో పెట్టక అదేమిటో త్వరగా చెప్పేసేవయ్యా!" అదేమిటో తెలిసికోవాలన్న పట్టుదల రెట్టింపయింది మూర్తికి, "జగదాంబ చెప్తుంది. అయ్యగారు నేటికి సరిగా" అంటూ తలపైకెత్తి ఆలోచించసాగాడు వాడు. "ఎంతకాలానికి చనిపోతానంటాడో" అనుకుని, అయినా నిశ్శబ్దంగా వింటున్నాడు. "నేటికి సరిగా 11 సంవత్సరాల 4 మాసాలక్రితం ఒక అమాయకురాలైన ఇల్లాలిని నిలువునా చెరచారు. ఆమె ఊరు వాయవ్యదిశ. పేరూ, ఇంకా వివరాలు చెప్పాలంటే యంత్రం వేయాలి." అంటూ డమరుక వాయించాడు. ఈ విషయం చెప్పేసరికి మూర్తిగుండె ఒక్కసారి ఆగిపోయినంత పనయింది. ముఖం వివర్ణమై శాగా చెమటపోసింది. "అసాధ్యుడల్లే ఉన్నాడే!" అనుకున్నాడు.

* * *

# ★ మరపురాని వసంత ★

అవి హైదరాబాదులో MSc చదువుతునే శుభదివసాలు. చదువు పూర్తికాకముందే ఒక బి. యే. గారితో సలక్షణంగా వివాహమై పోయింది తనకు. అమ్మ బలవంతంవల్ల పెళ్ళి చేసికొనక తప్పలేదు. మనవణ్ని ఎత్తుకోవాలని ఆమెకు మహాయిష్టంగా వుండేది. అందుచేత శ్రీమతిగారితో సహా పట్టణంలో ఓ ఇల్లు అద్దెకు కుదుర్చుకుని ఇటు సంసారం, అటు చదువూ వెలిగించేవాడు. "వివాహో విద్యానాశాయ" అంటారుకాని అది తనవిషయంలో పూర్తిగా విలోమంగా ఉండేది. చదువుకు ఎలాటివిఘ్నమూ రాకుండా శ్రీమతిగారు [బి. యే. కాబట్టి] తాను సక్రమ పద్ధతిలో చదువుకునేట్టు చూచేది. తోటి విద్యార్థులందరికీ సంసారంలో ఉండే సుఖం తెలియదు; సంసారులందరికీ యూనివర్శిటీలో విద్యార్థిగావుండే ఆనందం తెలియదు. అవి రెండూ తనకు ఏకకాలమందే లభ్యమయ్యే మహాభాగ్యం కలిగింది. ఇంటికి రాగానే స్వర్గంలో కొచ్చినట్టనిపించేది. యూనివర్శిటీ కెళ్ళితే ఇంద్రసభకు వెళ్ళినట్టుగా వుండేది. ఇలా దినాలు క్షణాలుగా గడిచిపోతుండేది. నిజంగా అటువంటి మహదానందం మళ్ళీ ఎన్నటికీ రాదు.

ఇంతలో శ్రీమతి పురిటికని వెళ్ళటమేమిటి, ఇక MSc పరీక్షలు నెల పదిపూటల్లో జరుగనున్నవని తెలియటమేమిటి, – ఒకేసారి జరిగాయి. శ్రీమతిగారు 'తాను రెండు మాసాల్లో బిడ్డనెత్తుకుని వస్తాననీ, పరీక్షకోసం చదువును విస్మరించరాదనీ, తననీ రెండు నెలలూ స్మరించకూడదనీ... ఈ విధముగా మరేవో కొన్ని షరతులుపెట్టి, ఎంత వద్దన్నా తండ్రిగారి బలవంతంమీద వెళ్ళిపోయింది. తన అమ్మకోరిక తీరే సుసమయ మొచ్చిందని చాలా సంతోషపడ్డాడు.

పోయినతరువాత ఒకరోజు, రెండురోజుల వరకూ మామూలుగానే ఉన్నాడు. కాని రానురాను పరిస్థితంతా అయోమయంగా తయారైంది. చదువుకోడానికి వెళ్ళటం పూజ్యమయింది. వాతావరణంలోని మార్పుల వల్ల ఒళ్ళుగూడ కొంచెం బద్ధకించింది. రోజులు గడచిపోతున్నాయి. గడచినకొద్దీ ఆరోగ్యం–ముఖ్యంగా మానసికారోగ్యం చెడిపోతూవచ్చింది. మనస్సు ఒకదానియందు లగ్నంకాకుండా, పరిస్థితి విషమించిపోతూవుంది. శ్రీమతిని త్వరగా పంపించమని మామగారికి రెండు మూడు కార్డులు వ్రాసినా వాళ్లు నవ్వులాటగా భావించి, "బిడ్డతోసహా వస్తుందనీ, ఎలాగో ఈ కాస్త రోజులు ఓపికపట్టమనీ జవాబు వ్రాశారు. అది చూసినప్పట్నుంచీ మరీ దిగులు పట్టుకుంది. ఇంకా కొన్నిరోజులా? అధమంగా ఇంకో నెల! ఒక్కడూ ఎలా ఉండటం? వెళ్ళినా శ్రీమతిని పంపించరు. అందులో తీరా పరీక్షల సమయం. చదువుదామని పుస్తకం తెరిస్తే మనస్సు ఢిల్లీవైపుపోతుంది; పుస్తకం బంగళాఖాతంలో పడుతుంది. యూనివర్శిటీకా వెళ్ళడంలేదు, ఇంకో ఉద్యోగమా? నాస్తి. ఉన్నా చేసే ఓపికెక్కడిది? శరీరం మాస్తే అలా వుంది. హోటలు మెతుకులు నాలుగు మింగటం – అది ఒకోనాడు లేనే లేదు—అస్తమానూ ఇంట్లో పచార్లు కొంతసేపూ, పడక కొంతసేపూనూ. దినమొగండంలా వుంది. ఇప్పుడు నిజమనిపిస్తూవుంది "సర్వం నాశాయ శోభనం" అనే సూక్తి. శ్రీమతి ఇంట్లో తిరుగుతున్నట్టే అనిపించేది. ఒక్కొక్కప్పుడు నిద్రలోనుండి పలవరిస్తూ హఠాత్తుగా మధ్యరాత్రప్పుడు మేలుకొనేవాడు. యథాప్రకారంగా ఆరిపోయినలైటు అగుపడేది. అంతా పిచ్చిపిచ్చిగా వుండేది వ్యవహారం. జీవితమింకెన్నాళ్ళిలా గడపడం? ఒక్కొక్కరోజు గడవటమే మహా యాతనగా వుంది. అనుభవమైతేతప్ప ఒకరికి చెప్తే అర్థంగాదు. అయినా తనగోడు విని సానుభూతిచూపించే ఆపత్కాలబంధువెవ్వడూ లేడు తనకు. ఒకసారి ఇంటవ్వ వచ్చి అడిగింది. "ఏం నాయనా! శశి వెళ్ళినప్పట్నుంచీ ఎలాగోవుంటున్నావు?" అని. "ఏంలేదవ్వా! పరీక్షలకోసం రాత్రింబవళ్ళు చదువుతూ ఉండటంచేత కొంచెం సుస్తీ అయిందంతే" అని పేలవంగా నవ్వాడు. ఇక లాభంలేదు. పరీక్ష పోతే పోయింది. కాని శ్రీమతిని చూడకుండా వుండటం వల్లగాదు. బయల్దేరాలి. తప్పకుండా రేపే బయల్దేరాలి, అని దృఢంగా నిశ్చయించుకున్నాడు.

అక్షరాలా వాతావరణం ఆరోజునకూడా ఇలాగే మబ్బుపట్టి చల్లని గాలితెరలు వస్తున్నాయి. ఇదే రే గంటల సమయం. ఆకాశంలో వర్షసూచన అగపడుతూ వుంది. చల్లని గాలికోసం తలుపులు తెరచుకుని ద్వారానికెదురుగుండా ఉండే పడకకుర్చీలో కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నాడు. తనగది కెదురుగా ఇంకోగది వుంది. దాన్లో ఇల్లుగలవాళ్ళి సామానేవో ఉంటాయి. అప్పుడప్పుడూ దాన్లోకి వెళుతూ తనను పలకరిస్తూ వుండేది అవ్వ.

ఇంతలో వీనులవిందుగా ఏదో కంకణక్వణనం వినబడి, సువ్యక్తమైన మధురానుభూతిని కలిగించింది. వ్రాతనాపివేసి ఎదురుగుండా చూచాడు. ఎవరో జవ్వని ఆ గది తాళం తీస్తూవుంది ఓరగా చూస్తూ. బహుశః వసంతేమో! తానెన్నడూ ఆవిడను చూళ్ళేదు గాని అవ్వ పిలుస్తూన్నప్పుడు ఆ పేరును చాలాసార్లు విన్నాడు. నిజంగా వసంతంలో వికసిస్తూన్న గులాబి మొగ్గలా వుంది వసంత. కాని పాపం! ఆమె అందానికి తగినట్టుగా రామప్రసాదు నల్లగా యమకింకరునికిమల్లే వుంటాడు. లోనికి వెళ్ళి సామానేవో సర్దేసి బయటికొస్తున్నప్పుడు ఆమెముఖం కనిపించింది. అబ్బ! నిజంగా బ్రహ్మదేవుడు ఒకసారి తన స్వహస్తాలతో, బంగారుతో ఆమెను తయారుచేసి దానికి సౌరభ్యాన్ని కూడా అమర్చినట్టున్నాడు. ఎంత అందం! వర్ణిస్తే, విని ఊరుకుంటారు గాని ఆమెను చూస్తే ఎంత నిగ్రహం గలవాడయినా గుటకలు మింగక మానడు. కుర్చీలోంచి లేచి తన లాంగ్ కోటును సవరించుకున్నాడు మూర్తి ఆమెను చూస్తూనే. తలుపు తాళంవేసి తనవైపు ఓసారి లేడికళ్ళతో చూచి భయంతో కూడిన చిరునవ్వు నవ్వింది. ఆ వసంతి దరహాసం, ఎండి మోడైపోయిన తన జీవితాన్ని వసంత ఋతువులాగా ఒక్కసారే చిగురింపజేసింది. అది చిరునవ్వు కాదేమో! ఆమె సహజమైన ముఖకాంతిలో తానే ఆనవ్వును ఆపాదించుకున్నాడేమో! అనుకుని వూరకున్నాడు.

ఓ పదినిమిషాల తర్వాత మళ్ళీ వచ్చి గది తలుపులు తెరచి లోనికిపోయి వెంటనే వెనుదిరిగి ప్రత్యేకంగా మరోసారి నవ్వింది. ఆ లేవెలుగులో, మేఘాల చాటునుండి తొంగిచూచే చందమామలా వుంది వసంత ముఖం. ఏదో ప్రబంధంలోని వాతావరణం గోచరమయింది. ఈసారి నిజమనుకోక తప్పలేదు. ఆమె తన్నుచూచి చిరునవ్వు నవ్వటంలో ఆశ్చర్యం లేదు. ఆమె అందానికి—అనగూడదు గాని—తనలాటివాడు భర్తయినా లోటే. అలాంటిది రామప్రసాదు—పాపం– ఆలోచిస్తే గుండె తరుక్కుపోతుంది. ఆమె వెళ్ళిపోయింది. తనలో ఎందుకో ఆ క్షణం నుంచీ ఉత్సాహం పెల్లుబికింది. పురుషులు అల్పసంతోషులుగదా! కొళాయివద్దకి పోయి శుభ్రంగా స్నానంచేసి స్వచ్ఛందమైన దుస్తులు వేసికొని 6 దాటక ముందే హోటలుకని బయలుదేరాడు. చల్లనిగాలి. ఆ గాలిలో ఏదో అవ్యక్తమయిన సువాసన ఇమిడి హృద్యమంగావుంది. ముంగురులు ఫాలభాగంలో దోబూచులాడుతున్నాయి.

వెళ్ళి భోంచేశాడు. శ్రీమతి వెళ్ళినప్పటినుంచీ కడుపునిండా భోంచేసిం దాపూటే. —ఇంటికొచ్చేసరికి ఏడయింది. ఆకాశంలో మేఘాలు దట్టంగా పరుగిడుతున్నాయి. లైటు వెలిగించి అదే కుర్చీలో కూర్చుని ఏదో వ్రాస్తున్నాడు. కలం నడుస్తూనే వుంది. కాని హృదయాన్నిమాత్రం వసంత లాక్కుపోతూంది. ఎనిమిదయింది. అలాగే కూర్చున్నాడు. "మాచెదవేలనో ప్రణయసుందరి" పద్యం జ్ఞాపకమొస్తూంది. ఆచిరునవ్వులోని అంతరార్థమేమిటో? అయినా అది నిజమో, భ్రమో? ఒకవేళ నిజమైతే తన పరిస్థితిని చూచి హేళనగా నవ్విందో-ఇలా సాగుతూంది ఆలోచన. వెంటనే శ్రీమతి జ్ఞాపకమొచ్చి తనవైపు నిశితంగా చూస్తున్నట్టనిపించింది. 'ఛీ! పరకాంతల తలచుకోవడం మహాపాప' మనుకుని ఊరట కల్గించుకో జూచాడు-గడియారం చూచాడు-తొమ్మిది-కాని వసంత అయస్కాంతంలా లాగుతూ వుంది. శశికళను వసంతలో మనోనేత్రంతో చూడసాగాడు. తనకు తెలియకుండానే ఉద్రేకం హెచ్చింది. అందులో ఇంకో విషయం వెంటనే జ్ఞప్తికొచ్చింది. రామప్రసాదు నిన్ననే వ్యాపారంకోసం బొంబే వెళ్ళాడు. 8 రోజులకుగాని తిరిగిరాడు. ఉద్రేకం రెట్టింపయింది. గాలి జోరుగా వీస్తూంది. కిటికీ తలుపులు మూశాడు. వీధి లైట్లన్నీ వెలుగుతున్నాయి. ఉన్నట్టుండి కుంభవోతగా వర్షం ప్రారంభమయింది. పదకొండుగంటల సమయం. విశ్వమంతా నిద్రాదేవిఒళ్ళోకి పోతోంది. గదిబయట కొచ్చి తలుపువేశాడు. మనస్సు వారించినా కాళ్లు వాటంతటవే ముందుకు సాగిపోతున్నాయి. అవ్వగది దాటి, వసంత పడకగది వద్దకు ప్రవేశించాడు. ఇంట్లో లైట్లన్నీ ఆర్పిచేయబడటంచేత కన్ను పొడుచుకున్నా కానరాని కటికచీకటి. గుడ్డివాడిలా తడుముకుంటూ వెళ్లాడు. గది తల్పులు ఓరగా వేసివున్నాయి. కామానికి కళ్లులేవు. అది ఎంతి వివేకవంతుల్నయినా నీచానికీ, క్షమించరాని మహాపరాధానికీ గురిచేస్తుంది. లోపల బెడ్‌లైటేమో, ఉండీ లేని సమానంగా మసకమసకగా వెలుగుతూన్నట్టుంది. వర్షం జోరుగా కురుస్తూ వుండటంచేత రేకులు డబడబా చప్పుడు చేస్తున్నాయి. తనకాళ్లు గజగజా వణుకుతున్నాయి. అంతవానలోగూడ ఉక్కగా వుంది. 'ఒకవేళ వసంత దొంగ దొంగ అని అరవటమో లేక అల్లరిచేయటమో అలాంటిదేదైనా జరుగుతే అమ్మో! ఇంకేమైనా వుందా? కొంప నిలువునా మునుగుతుంది. ఆడవాళ్ళు నాలుగుగోడల మధ్య ఒంటరిగా వున్నప్పుడు అబలలుగా వుండరు. నమ్మరాదు. ఈ వర్షంలో ఎవరికీ వినబడకున్నా, రేపు ఎలాగా బ్రహ్మాండం బద్దలయి తీరుతుంది. మనస్సు, సంస్కారం వెనక్కు లాగాయి. కాని అప్పటి చిరునవ్వు శరీరాన్ని బలవంతంగా పురోగమింపజేస్తూ వుంది. ఉద్రేకం, అవకాశం, దానికి దోహదం చేస్తున్నాయి. అంతటి సాహసం తన జన్మలో ఇంతవరకూ చేయలేదు. ఇకముందు కూడా చేయడు. "ధైర్యసాహసేలక్ష్మి"అనుకుని తలుపులు త్రోశాడు-"వసంతా" అని పిలిచాడు. ఆ పిలుపు అగాధంలోంచి వచ్చింది. గుండె వేగంగా కొట్టుకుంటూ వుంది వలలో చిక్కిన పక్షిలా. అంత చప్పుడులో ఎలా వినిపించుకుందో?-ఆప్యాయంగా ఆహ్వానించింది. సహృదయంగా ఆదరించింది. బెడ్ లైటు ఆర్పివేసింది. అంతే! ఆనాడుస్వర్గం-అన్నాతక్కువే!

ఇక తెల్లవారింది. ఎంచేతో ఇక ఆ యింట్లో ఒక్కనిమిషమైనా నిలువ బుద్ధి పుట్టలేదు. స్వర్గం, నరకంగా మారటానికి ఎంతోసేపు పట్టదు. తన పరువూ, ప్రతిష్ఠా, పలుకుబడీ, చదువూ, సంస్కారమూ, అన్నీ నాశనమవటానికి గూడ ఎంతో కాలం పట్టదు. ఆంతరంగిక జీవితంలో అవన్నీ నశించిపోయి నట్టే. కాని ప్రపంచంలో ఉన్న నాలుగు నాళ్ళూ తలెత్తుకుని తిరగటంకోసం, పెద్దమనిషిగా బ్రతకటంకోసం ఆ యిల్లు విడవక తప్పలేదు. ఆరోజే అవ్వకు ఏదో కారణం చెప్పి, ఆనెల అద్దె చెల్లించి, ఇల్లు ఖాళీచేసి, శ్రీమతి వచ్చేవరకూ 'వసంత్ విహార్'లో గడిపాడు. పరీక్షకుపోలేదు. సరి కదా! ఏమీ చదవకుండానే ప్రథముడుగా వచ్చాడని తోటివాళ్లందరూ తన్నభినందించారు. అదంతా వసంతచలవవల్ల అని తనకుదప్ప ఈ సువిశాల ప్రపంచంలో మరే ప్రాణికీ తెలియదు. ఇదీకథ. నేటికి సరిగా పదకొండు నిండువసంతాలూ, నాలుగు పూర్ణశశికళలూ గడిచాయి. ఈ విషయం బ్రహ్మకుగూడా తెలియలేదు. కాని ఈ జోస్యం తన్ను వెఱ్ఱివాణ్ణిచేసింది.

కృష్ణమూర్తి ముఖం కళావిహీనమైపోయింది. శరీరమంతా బలహీనమయిపోయింది.

* * *

"అంబా పలుకు, జగదాంబ పలుకు" అంటూ డమరుక వాయించాడు వాడు. "...నిలువునా చెరచారు" అని వాడన్న మాట తిరిగీ అంతరంగంలో ధ్వనించింది. "ఆమెను చెరచటమేగాదు. నేనూ చెడిపోయాను" అని అతని మూగగొంతుక ప్రతిధ్వనించింది.

ఓ రెండు రూపాయల కాగితం తీసి వాడి చేతిలో పెట్టి వాణ్ణి సాగనంపాడు. జోస్యమన్నా, మంత్రాలన్నా ఆ రోజునుంచీ బలంగా నమ్ముతున్నాడు-నమ్మక తప్పదు.

* * *

కాని, రెండు సంవత్సరాలకుగాని, ఆరోజు వసంతగదిలోనికి వెళుతున్నప్పుడు కూడా తనడైరీని పట్టుకెళ్లాననీ, వచ్చేఅప్పుడు అది తీసికొనిరావటం మరచాననీ, వచ్చిన బుడబుడక్కలవాడు వివేకంగల రామప్రసాదే అనీ, తెలియలేదు కృష్ణమూర్తికి.

కాని ఒక్క సందేహం మాత్రం ఇప్పటికీ అలానే మిగిలిపోయింది. "పదకొండు సంవత్సరాల వరకూ తన డైరీ ఎక్కడ దాక్కుని వుందే?" అని.

తనకు వసంత ఊరుపేరూ అలా వుంచి. ముక్కూ, ముఖమూ గూడా సరిగా తెలియదు. అలాంటి వసంతయొక్క శేష జీవితాన్నిగురించి, తనుతప్ప ఎవరూ ఆలోచించి, నిజమైనసానుభూతిని పొందలేరు. ★

# పేనా దొరికింది!

మేడమీద గదిలో కూర్చొని "గదిలో శవం!" డిటెక్టివ్ నవల సీరియస్‌గా చదువుతున్నాడు దాసు. కథ మాంఛి పట్టులో వుంది. అంటే ఇక డిటెక్టివ్ హంతకుణ్ణి పట్టుకోబోతున్నాడన్న మాట! కనుబొమలు పైకెత్తి, శరీరమంతా ఉప్పొంగిపోతుంటే, ఒక్కొక్క వాక్యాన్నీ నమిలి, మ్రింగి జీర్ణం చేసుకుంటూ చదువుతున్నాడు దాసు. కానీ ఇంతలో డిటెక్టివే కథలో హంతకుడి చేతిలో చిక్కాడేమో. కోపంతో కోరివిలా మారింది దాసు మొహం. ఆ కోపరసంలో మునిగితేలుతున్న దాసు చెవికి "దాసూ! దాసూ!" అంటూ కిందనుంచి కేక వినబడ్డది. ఇష్టం లేకపోయినా గదిలో శవాన్ని పక్కనబెట్టి కిందికి దిగి వచ్చాడు దాసు.

"అబ్బ ఎన్ని కేకలేసినా కదిలి రావేమిట్రా దాసూ?" రాముం కాస్త కోపంగా అన్నాడు.

"ఎన్ని కేక లేశావేమిట్రా?" ఆశ్చర్యంగా అడిగాడు దాసు.

"ఓ...అరగంట కావొస్తోంది. అప్పట్నుంచీ దాసూ దాసూ అంటూ ఇక్కడ నిల్చొని తన్నుకుంటున్నా..."అల వైకుంఠపురంబులో నగరిలో" అన్నట్టుగా ఎక్కణ్ణుంచో నెమ్మదిగా సుందరవిగ్రహం సాక్షాత్కరించింది ఇప్పటికైనా" వచ్చి చాలా సేపయిందేమో చిరుబురు లాడుతున్నాడు రాముం.

"వినపళ్ళేదు లేరా రాముం. రా! అలా మేడమీదికెళ్దాం!"

"ఊహూ! నా పార్కరు పెన్ను తీసికెడదామని వచ్చాను ... బోలెడన్ని లెక్కలు వర్కు చేసుకోవాలి."

"నా దగ్గరెక్కడుందీ! పొద్దున అప్పుడే ఇచ్చేస్తినే మేడమీద!" దాసు ఆశ్చర్యంగా అన్నాడు.

*~~~~~~~~~~~~~~~~*

## పవని నిర్మలప్రభావతి

*~~~~~~~~~~~~~~~~*

"ఇచ్చావా? అయితే ఎలాపోయింది చెప్మా!?" రాముం ఆలోచన్లో పడ్డాడు.

"ఏమిటి పోయిందా?" దాసు ఘట్టిగా అన్నాడు కళ్లు పెద్దవిచేస్తూ.

"ఆ! పోయిందిరా! లేకపోతే గోపాలం ఏమన్నా తీసుకెళ్ళాడేమో!" రాముం సందేహాన్ని వెలిబుచ్చాడు.

"గోపాలం వచ్చాడా మీ ఇంటికి— ఆరి! సిగ్గులేని గాడిదా! వారం రోజుల్నుంచీ మనతో మాట్లాడకనే పోయేనే! మళ్లీ ఎందుకు పలికావ్ వాడితో?" దాసు కోపంగా అన్నాడు.

"నే పలకలేదురా వాడే వచ్చాడు మా ఇంటికి. వచ్చాడా? నేరుగా మేడమీదికి వచ్చేశాడు...అన్నట్టు నువ్వు పెన్ ఇచ్చిపోయినావురా..." రాముం జ్ఞాపకం చేసుకుంటూ అన్నాడు. "అవును నే నప్పుడే ఇచ్చేశాను."

నేను సైన్సు రాసుకుంటున్నానా...? వచ్చి పక్కన కూచుని "ఈ పెన్ ఎప్పుడు కొన్నావురా?" అన్నాడు. చెప్పాను. ఈ లోపల మా చెల్లాయి కేకేసింది ఇప్పుడే వస్తానని కిందికిదిగి వెళ్లేను. కాస్సేపటికి మేడమీదికివచ్చి వాడితో మాట్లాడాను. తర్వాత తొందరగానే "వెళ్ళొస్తానని" వెళ్లిపోయాడు గోపాలం. అప్పుడు జ్ఞాపకం లేదురా పెన్నుమాట...ఓ గంటయిన తర్వాత చూద్దునుగదా పేనా లేదు. నీ దగ్గరేమైనా వుందేమోనని వచ్చాను చూడు" రాముం గుక్క తిప్పుకున్నాడు.

దాసు మాంచి ఆలోచన్లో పడ్డాడు. తప్పకుండా ఆ పేనా గోపాలం కాజేసుంటాడని అతని దృఢ నమ్మకం.

దాసు మొహంవేపు చూస్తూ రాముం అన్నాడు "ఏమిట్రా దాసూ! అలా ఆలోచిస్తున్నావ్?"

"వాడే నీ పెన్ను దొంగిలించుంటాడురా!" దాసు దృఢంగా అన్నాడు.

రాముం నవ్వాడు "పాపం! అంతా అనబోకు వాణ్ణి నేనుగదూ సాగనంపి వచ్చింది. చేతులోగాని జేబులోగాని ఏమీ లేందే!"

రాముం మాటలకు దాసు నవ్వాడు. ఘట్టిగా నవ్వాడు "కాల్చిన శవం"లో డిటెక్టివ్ నవ్వినట్టు నవ్వాడు.

రాముం కాస్త కోపంగా అన్నాడు "ఏమిట్రా వెనవ నవ్వు?"

"ఒరీ ఎక్కడన్నా హంతకులు వస్తువుల్ని జేబుల్లో, చేతుల్లో పెట్టుకుంటారుట్రా?" దాసు గంభీరంగా చూశాడు. రాముం అదిరిపడ్డాడు.

"హంతకు లెవర్రా?"

"అహా...హంతకులు కాదనుకో. దొంగ...ఎవరైతేనేం?"

"అదే పోనీ వాళ్లే రాముం" అన్నాడు.

"ఇంకెవరు గోపాలంగాడే!" సమస్యను సాల్వ్‌చేసిపారేస్తూ అన్నాడు దాసు.

"అయితే పెన్ను వాడే తీశాడంటావ్?"

"అక్షరాలా వాడే తీశాడు. లేకపోతే గదిలో పెన్ను ఎలా పోతుందీ...అక్కడికెవరొస్తారూ?" దాసు మొహంలో క్వొశ్చన్‌మార్కు చూపెట్టాడు.

ఎటూ చెప్పలేక రాముం ఊరికే నిలబడ్డాడు.

హఠాత్తుగా ముందుకు నడుస్తూ దాసు అన్నాడు. "మీ ఇంటికి పోదాంగా!"

రాముం ఆశ్చర్యపోయాడు

"ఎందుకు?"

"నీ పేనా కనిపెట్టే పూచీ నాది. కాస్త నే చెప్పినట్టు చెయ్యి, మాట్లాడకుండా" దాసు మొహం చాలా సీరియస్‌గా వుంది.

రాముం మాట్లాడకుండా నడిచాడు

దోవలో పోతున్నంతసేపూ దాసు తాను చదివిన డిటెక్టివ్ నవలలన్నీ వరసగా జ్ఞప్తికి తెచ్చుకుంటూ వాటిల్లోని డిటెక్టివ్‌లు ఎలా ఏ ఆధారాలవల్ల హంతకుల్ని, లేక, చోరుల్ని పట్టుకుంది నెమరు వేసుకుంటున్నాడు. ఆ

అడుగుజాడల్లోనే తానూ రామం పెన్ను పరిశోధన సాగించాలి. సాధించాలి. ఇందులో విజయం పొందేడో...ఇహ తన స్కూల్లో ఎవరికి ఏ కష్టం గలిగినా, ఏ వస్తువుపోయినా డిటెక్టివ్ దాసూ" అంటూ వస్తారు. తన దగ్గరికి...ఇక సంతోషంతో ఆలోచించలేక పోయాడు. చివరకు రామాన్ని తన అసిస్టెంట్‌గా ఉండేందుకు వప్పిద్దామనుకున్నాడు.

దాసు, రామం ఇంటికి చేరారు. రామం కంటే ముందు మేడ ఎక్కాడు.

"ఎక్కడరా నువ్వు రాసుకుంటూంది?"

"అదో ఆ టేబిల్ దగ్గిరి చాపమీద" రామం చూపించాడు.

"అయితే అన్నీ బాగా వెతికావుకదూ?"

"ఆహా...అంతా వెతికే నీదగ్గరకొచ్చింది."

దాసు మాట్లాడకుండా గదిగుమ్మం దగ్గర నిల్చుని లోపలంతా పరిశీలనగా చూస్తున్నాడు. అంటే పరిశోధన మొదలెట్టాడన్న మాట.

"ఏమిట్రా అలా చూస్తున్నావ్?"

"ఏమీ లేదులే" ఏమి తోచిందో జాగ్రత్తగా దాసు గది కిటికీదగ్గరకు నడిచాడు వంగుని.

"ఏమిట్రా వెధవయాక్షనూ నువ్వూ! ఒంగుతావు లేస్తావు. ఏమిటంటే చెప్పవేం" రామం చిరాగ్గా అన్నాడు.

"అబ్బ గోల చెయ్యకు. నే చెప్పినట్టు చెయ్యమని చెప్పానా?"

దాసు జేబులోంచి భూతద్దం ఒకటి పైకి తీశాడు.

"అదేమిటి మళ్ళీ?" రామం అన్నాడు.

"భూతద్దం" దాసు వంగి నేలమీద పరీక్ష చేస్తూ అన్నాడు.

"నేను సరిగ్గా కనపట్టం లేదా నీకు ఖర్మ"

"ఈ గది చిమ్మలేదూ ఈ గోజూ?"

దాసు రామంవేపు చూస్తూ అన్నాడు.

"ఊహు చిమ్మలేదులే. ఏ మొచ్చింది ఇప్పుడు?"

"ఇలారా చెప్తా! చూడు ఈ అడుగుల గుర్తులు నేరుగా కిటికీదాకా వచ్చి మాయమయ్యాయ్"

"అంటే?"

"నీ పెన్ను ఈ కిటికీగుండా పోయిందన్న మాట!"

"అయితే ఈ కాలంలో పేనాలక్కూడా నడకవచ్చు నన్నమాట?" రామం నవ్వాడు.

దాసు చిటపట లాడేడు.

"ఛీ చచ్చు పీను గా! చెప్పే పాయింట్ కాస్తయినా అర్ధంకాదు. గోపాలం దొంగ కాదు!"

"అదేకదా నీతో నే చెప్పింది. మధ్యలో నువ్వేకదూ హంతకుడనీ, దొంగనీ, కొత్త కొత్త మాట లన్నది"

(56-వ పేజీ చూడండి)

# కథలూ

**"శ్యామసుందర్"**



"అయితే మీరు సిద్ధంగా వున్నారన్న మాట!" అని ఒక్కసారి వనజ, సరస వంక చూశారు శ్రీపతిగారు.

వనజ, సరస అనే పేర్లనుబట్టి ఆడవాళ్ళని అనుకునే ఆస్కారం లేక పోలేదు. కాని నిజానికి వీళ్లిద్దరూ నూటికి నూరుపాళ్లు పురుషులే. కాని కథకులవటం వల్ల స్త్రీ రూపం దాల్చారు. మొదట్లో కొన్నాళ్ళు స్వంత పేర్లతో చాలా కథలు వ్రాసి అందుబాటులో వున్న పత్రికలకు పంపించేవారు. పాపం వాటిని యెంతో కష్టపడి వ్రాసేవాళ్ళు. వాటికోసం నిద్రమానుకుని అర్ధరాత్రిళ్ళు దీపాలముందు కూర్చుని వ్రాయబోతుంటే భార్యలు "యేమిటండీ, నిద్ర పోనీకుండా యెదురుగా దీపం, మీరూనూ" అని విసుక్కున్నా సహించి నానా అవస్థలు పడి కథ పూర్తిచేసి మరునాడు తీరిగ్గా మరోమాటు చదువుకుని భేషుగ్గా వుందని తృప్తి పడేవాళ్ళు. ధీమాగా పత్రికలకు పంపేవారు అందులో వనజగారికి యెక్కువ శ్రమ తీసుకునే అలవాటున్నది. కథ పత్రికకు పంపించిన మరు రోజునుంచి స్నేహితులకు చుట్టాలకు "నేఫలానా కథ రాశాను - ఫలానా పత్రికలో పడుతుంది. ఫలానా రోజుల్లో చూసిచదవరూ" అని చాటుకునేవాళ్ళు. అలా యింకా పడుతుంది—చివరకు యివ్వాళో రేపో అని అనుకుంటుండగా పోస్టు జవాను తిరిగి తెచ్చి యిచ్చేవాడు ఆరోజు టపాలో. ఇలా తిరిగివస్తున్న కథలు యెక్కువై యెక్కువై చివరకు వీళ్లిద్దరూ పేరుమార్పుతో మళ్లీ పంపించటం మొదలెట్టారు అవే కథల్ని. అవే పత్రికలు అవే కథల్ని పేరు మార్పుతో ప్రకటించి యీ పురుష స్త్రీలకు ప్రోత్సాహమివ్వటం మూలంగా యీనాడు వనజ, సరస గార్లు, ఘరానా కథకులై వెలుగుతున్నారు.

"వో, సిద్ధంగా వున్నాం" అన్నారు వనజ, సరసగార్లు.

శ్రీపతిగారు సిగరెట్ తీసి తనొకటి వెలిగించి, వాళ్ళిద్దరికీ చెరొకటి యిచ్చారు. వాళ్లు సిగరెట్లు కాల్చుకున్నారు.

"ఇక వినండి" అని శ్రీపతిగారు మొదలెట్టారు. "మావూళ్ళో మా యింటి ప్రక్కన రాఘవయ్య గారని ఒకాయన వుండే వారు. వారికి సరిగ్గా నా వయస్సే వున్న ఒక కొడుకు వున్నాడు. వాళ్ళింటి ప్రక్కయింట్లో ఒక వకీలుగారు వుండేవారు. వారికి నలుగురు పిల్లలు. అందులో రాధ అనే అమ్మాయి పెద్దది. రాఘవయ్యగారి కొడుకు మురళి, వకీలు గారమ్మాయి రాధా యిద్దరూ ప్రక్కయింటి పిల్లలవటం వల్ల కలసి మెలసి ఆడుకుంటూ చదువుకుంటూ వుండేవాళ్ళు చిన్నప్పుడు. పెరిగి పెద్దవాళ్ళయ్యారు. వాళ్ళిద్దరు ఒకర్ని ఒకరు గాఢంగా ప్రేమించుకున్నారు. ఒకళ్ళని విడిచి ఒకళ్ళు బ్రతకలేమనుకున్నారు. చివరకు పెళ్లి చేసుకోవాలనుకున్నారు. కాని అదృష్టం బాగుండక రాధకు వేరేసంబంధానికి పెళ్ళయిపోయింది. తరువాత మురళి చాలారోజులు విచారించాడు నిరాశతో. చివరకు మతిస్థిమితంకోసం ఉద్యోగంలో చేరాడు" అంటూ ఆపి చివరిదాకా కాలిపోతున్న సిగరెట్ పీకను అవతల కిటికీలోగుండా బయట పారేశాడు శ్రీపతి. వనజ సరసలు 'వూ, తర్వాత' అని గట్టిగా చివరిదము పీల్చి సిగరెట్ పీకల్ని అవతల పారేశారు.

మళ్ళీ శ్రీపతి మొదలుపెట్టాడు: "మురళి ఉద్యోగంలో చేరటానికి మదరాసువెళ్లాడు. ఆఫీసుకెళ్లాడు. తనుచేరి పనిచెయ్యాల్సిన సెక్షన్ సూపరింటెండెంట్ గారిని కలుసుకోటానికి మరో గదిలో కెళ్లాడు. సూపరింటెండెంట్ గారిని చూచేటప్పటికి మురళి ఆయనాగూడా కొంచెం ఆశ్చర్యపోయార వాళ్లిద్దరూ చిన్నప్పుడు మురళీ వాళ్ వూళ్ళో యెలిమెంటరీ స్కూలులో చదు కున్నారు. తరవాత సూపరింటెండెంట్ తండ్రి రెవిన్యూ ఇన్స్పెక్టరు అవటంవ మరోవూరు ట్రాన్స్ఫరై వెళ్లిపోయార చిన్ననాటి మిత్రులు తిరిగి అనుకోకుం అప్రయత్నంగా కలుసుకోవటం యిద్ద ఆనందాన్నిచ్చింది. అందుకని—" ఇంకా శ్రీపతి చెప్పబోతుండగా "మురళిని కొత్తవూళ్ళో గదిదొరకేదా తనింట్లోనే వుండమని సూపరింటెండెంట్ గారు అని అతన్ని వాళ్ళయింటికి తీసుకు వెళ్ళివుంటారు సంతోషంగా" అని మిగ దాన్ని పూర్తిచేశాడు.

సరస, వనజ చెప్పింది యెంతవర నిజమో తెలుసుకోటానికి శ్రీపతి ముఖంలో తదేకదృష్టితో ఆత్రుతతో చూస్తున్నాడు.




శ్రీపతి "అవును. అంతే. అలామురళిని తనింటికి తీసుకెళ్ళాడు" అన్నారు.

వనజ విజయగర్వంలో సరస వంక చూశాడు.

"పొద్దుపోయేదాకా మిత్రులిద్దరూ తమ చిన్ననాటి విషయాల్ని తలుచుకుంటూ కాలం గడిపారు. తరువాత యిద్దరు భోజనాలకు లేచారు. ఇద్దరూ పీటలమీద కూర్చున్నారు. మురళి, మిత్రుడు చెపుతున్న మాటలకు 'ఊఁ' కొడుతున్న వాడల్లా ఒక్కసారిగా" అని యింకా శ్రీపతి చెప్పబోతుండగా సరసగారు "మిత్రుని భార్యని చూసేసరికి మురళి కొయ్యబారిపోయాడు ఒక్క క్షణం" అని అందించాడు.

వనజ "ఆ చరిత్ర మీకిదివరకే తెల్సా" అని అడిగాడు సరసగార్ని. "ఈమాత్రం ఊహించలేకపోతే మనం కథలు వ్రాయటమెందుకు" అంటూ వనజకు సమాధానం చెప్పి, తను చెప్పింది 'అవునో-కాదో' తెలుసుకోటానికన్నట్లు శ్రీపతి వంక చూశాడు సరస.

శ్రీపతి "నిజమే మీరన్నట్లు మురళి ఒక్క క్షణంపాటు కొయ్యబారిపోయాడు. తన మిత్రుని భార్య తన చిన్నప్పటి రాధ, తనని ప్రేమించినరాధ, తను చేసుకోందామనుకున్న రాధ, తనను చేసుకోమని అన్న రాధ." అన్నారు.

సరస, వనజగార్లు తమ స్వంత జేబుల్లోంచి సిగరెట్లు తీసి వెలిగించారు. శ్రీపతిగారు వాళ్లవంక ఒక్క క్షణం చూసి తన జేబులోంచి సిగరెట్ తీసి తనూ వెలిగించారు.

"భోజనాలయినయ్" అంటూ మళ్లీ మొదలెట్టారు శ్రీపతి. "ఇద్దరు మిత్రులూ వాకిట్లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ తాంబూలాలు వేసుకుంటున్నారు. అంతలో వాళ్ళ ఆఫీసు జవాను రాఘవులు వచ్చాడు.

"ఎందుకురా వచ్చావ్" అన్నాడు మురళి మిత్రుడు.

"పి. ఎ. గారు ఇంకో అరగంటలో ఆఫీసుకు వస్తారట. తమర్నిగూడా రమ్మన్నారండి" అని చెప్పిపోయాడు రాఘవులు.

"అయితే నువ్విప్పుడు ఆఫీసుకెళ్లాలా" అడిగాడు మురళి.

ఆ. వెళ్లాలి. చచ్చేటంత పనివుంది. ఒక్కొక్కప్పుడు తెల్లవారుతుంది కూడా. అట్లాంటప్పుడు కాఫీగూడ తాగి రావటం అలవాటు ప్రొద్దున్నే." అన్నాడు మిత్రుడు.

"మరి కొంచెం సేపటికి మురళి మిత్రుడు బట్టలు వేసుకుని ఆఫీసుకు పోతూ "నీకు మేడమీద పక్క వేయించాను. నే వచ్చేటప్పటికి ప్రొద్దుపోతుందేమో, పెందలాడే పడుకో" అని వెళ్లిపోయాడు," అని ఆపారు శ్రీపతి గారు.

"ఇక మీరు చెప్పనక్కర్లేదు. మేమే చెప్తాం" అన్నాడు సరస.

"ఇదేనా-ఇంకా ఎంతపెద్ద సమస్యో అనుకున్నా" అన్నాడు వనజ. శ్రీపతి "సరే-అయితే చాల క్లుప్తంగా త్వరగా, చెరో కాయితంమీద పూర్తిచేయండి కథను" అన్నాడు.

వనజ, సరసగార్లు వెంటనే తెల్లకాయితాల్ని తీసుకున్నారు. చెరో కొత్త సిగరెట్ తీసి వెలిగించారు. ఆ విధంగా నిశ్చలంగా కూర్చుని వ్రాయటం మొదలుపెట్టారు కథ చివరి భాగాన్ని. కొంతసేపయిన తరువాత యిద్దరూ "వ్రాశాం" అన్నారు.

శ్రీపతి "అయితే యిలా యివ్వండి." అని యిద్దరిదగ్గర్నుంచి కాయితాలుతీసుకున్నారు. మొట్టమొదట వనజ వ్రాసిన కాయితం తీసి చదవటం మొదపెట్టాడు శ్రీపతి.

"మురళి మేడమీదకెళ్ళి పక్కమీదపడుకున్నాడు. ఎంతసేపటికి నిద్రపట్టలేదు. అటూయిటూ పొర్లాడు చాలా సార్లు. తలంతా ఏవో ఆలోచనలతో నిండిపోయింది. కిటికీలోగుండా ఆకాశంలోకి చూశాడు. చందమామను కారుమబ్బు కమ్మివేస్తోంది. తను సిగరెట్టు వెలిగించాడు. అటూయిటూ పచార్లు చేశాడు. హృదయం ఘోష పెడుతోంది. చికాకు మరింత ఎక్కువయింది. ఆవేశం పైకి చిందటానికి ప్రయత్నిస్తోంది. కాని నరాలు గట్టిగా పట్టుపట్టాయి. మళ్ళీ పడుకున్నాడు. నిద్దరాలేదు. కాళ్ళుఆడించాడు. జుట్టులోకి చేయిదూర్చి తలగట్టిగా పట్టుకున్నాడు. ఆలోచనలు కరుగెట్టిపోతున్నాయి. ఆకాశంలో మళ్ళీ కిటికీలోంచి చంద్రుణ్ణి చూశాడు. చంద్రుడు కనిపించటం లేదు, మబ్బు పూర్తిగా కప్పివేసింది. గది తలుపులు తెరచాడు. నెమ్మదిగా చీకటిలోనే మెట్లు దిగుతున్నాడు. మెట్ల వంపుదగ్గర గన్నేరుచెట్టుమాటున ఏదో కదలిక అయింది. ఆగిపోయాడు మురళి

## ★ కథలూ, కథకులూ ★

అనుమానంతో, ఒక్క మెట్టు మళ్ళీ కిందకు దిగాడు. గన్నేరుచెట్టుక్రింద రాధ నుంచుని వుంది. మురళి ఆశ్చర్యపోయాడు. కాని ఏం మాట్లాడలేకపోయాడు. రాధకూడా మాట్లాడాలని ప్రయత్నించినా పలకరించలేకపోయింది. చివరకు మురళి 'రాధా' అన్నాడు. రాధ మారుపలుకలేదు. ఇద్దరూ చెరో అడుగు దగ్గరకొచ్చారు. 'మనం చిన్నప్పుడు ఎంతో అనుకున్నాం – ఎంతో ఆశించాం – ఎన్నో కలలు కన్నాం' అన్నాడు మురళి. "అవును" అంది రాధ ముక్తసరిగా చివరికి.

"కాని భగవంతుడు చిన్నచూపు చూశాడు. తలవ్రాతలు మారిపోతే మనమేం చేయగలం. విధిని ఎదిరించలేకపోయాం, చివరికి చెరొక దారి అయినాం—కాని" అన్నాడు మురళి ఉద్రేకంగా.

"కాని—నీవు పెళ్లి చేసుకున్నావా" అంది రాధ.

"దానిసంగతి అలావుంచు—యింతవరకు లేదు–కాని" మళ్ళీ మురళి సగంలోఆపాడు.

"కాని—ఏదో చెప్పదలచి ఆపేశావేం" అంది రాధ బాధగా.

"ఏం లేదు. చివరిసారిగా నా చిన్నప్పటి రాధగా నిన్ను పలుకరించాలనిపించి వచ్చాను. అదృష్టవంతుణ్ణి అన్నాడు.

"అంతవరకే నేనూ కోరింది—యిదే చివరిసారి" అంది రాధ.

"అవును. ఇదే చివరిసారి. ఇంతటితో మన చిన్నప్పటి కథల జ్ఞాపకం సమాధిచేయబడాలనే నా కోరిక. నువ్వదృష్టవంతురాలివి రాధా! నా మిత్రుడెంతో మంచివాడు. ఇక నించి నిన్ను నాతోబుట్టువుగా చూచుకుంటాను. ఇట్లా నిన్ను అర్ధరాత్రి ఒంటరిగా కల్సుకోటానికి ప్రయత్నించినందుకు క్షమించు" అని మైమరిచిపోయాడు.

"నువ్వు నిజంగా మంచివాడివి. నేకోరిందీ అంతవరకే—ఇక మనం, మన పూర్వ చరిత్రను మరచి మామూలు మిత్రులవలె బ్రతుకుదాం" అంది రాధ.

తర్వాత కొంచెంసేపు మౌనంగా వుండి యిరువురు ఎవరి శయనమంది

రా లకు వాళ్లు వెళ్ళారు" అని వనజ వ్రాసిన కాయితాన్ని చదివి మడిచి అవతలపెట్టి మళ్లీ సరస వ్రాసింది చదవటం మొదలెట్టారు శ్రీపతిగారు.

"మురళికి నిద్రపట్టలేదు! ఏదో... తీరని వ్యథ...మనసులో వుంది! ఎన్నాళ్లిబట్టో హృదయంలో జీర్ణించిన ఆలోచనలు... ఒక్కసారి కట్లు తెంచుకోటానికి ప్రయత్నిస్తున్నయ్! మురళి దుర్బలుడు కావటం వల శరీరం అతనిపట్టు విడిపించుకుంది! గబగబా మురళి...అద్దంముందు నుంచుని... ముఖం చూచుకున్నాడు! ముఖం చెమట బిందువులతో...గజిబిజిగా...వుంది! ఏదో ...గంభీరంగా కన్పడుతున్న...చిన్న మనస్సుతో...తలుపు తెరిచాడు! బయట... ఉరుములు ఉరుముతున్నై...గాలి జోరున వీస్తోంది...వర్షం...చిన్న చిన్న తుంపరలుగా ప్రారంభించింది......మురళి దొంగలాగా మేడమెట్లు దిగి నెమ్మదిగా......తలుపు తట్టాడు! ఒకటి రెండుసార్లు...తలుపు తట్టిం తరువాత...తలుపు తెరువబడింది! లోపల రాధ కన్పించింది...ఒక్క క్షణం ఏం మాట్లాడలేకపోయాడు మురళి...చివరకు "రాధా" అన్నాడు...అణచుకున్న ఆవేశంతో! మరో క్షణం తరువాత "ఎందుకు వచ్చారు" అంది రాధ శవంలాగా!!

"ఎందుకో—ఎందుకో?"అని తన హృదయాన్ని తడుముకున్నాడు మాటలకోసం మురళి!

"ఆ—ఎందుకు" అడిగింది రాధ మరింత గంభీరంగా...!

"ఎందుకో-వచ్చాను- ఆఖరిసారి నిన్ను-నిన్ను కల్సుకుని హృదయంలోని బాధ చెప్పటానికి—నువ్వు నన్ను మోసంచేశావ్... ప్రేమించానని ఆశపెట్టావ్! నన్ను ఊరించావ్! చివరకు నన్ను నడిసముద్రంలో ముంచి...ఏకాకిని చేశావ్! వేరొకరిని పెళ్లాడావ్! నీకోసం...నీకోసం..."

"నేనేం మోసంచేశాను? మోసం చేసింది నేను కాదు... నువ్వు... చిన్నప్పటినించి నన్నే చేసుకుంటానన్నావ్... కాని సమయం వచ్చేసరికి మీ వాళ్లకు చెప్పే ధైర్యం లేక వూరు వదలివెళ్లావ్...నువ్వే నన్ను మోసం చేశావ్...నాకోసం, నీ మాట నిలబెట్టుకోటంకోసం ఏం చేశావ్—" అంది రాధ. రాధ ఉగ్రురాలయింది!

"ఏం చేశానా...నీ పెళ్లివిషయం నాకు తెలీదు. సెలవులకు యింటికొచ్చేసరికి పెళ్లయిందన్నారు. తరువాత యింకేం చేస్తాను. నీకోసం విచారించాను... విలపించాను... మరచిపోదామని ప్రయత్నించి విఫలుణ్ణయి ...చివరకు నిద్రాహారాలు మాని...చివరకు మతిపోయి ఆరోగ్యం చెడగొట్టుకుని పిచ్చివాడిలాగా...దిక్కులేనివాడిలాగా తిరిగాను!"

"మంచిపని చేశావ్...మతి లేకపోవటం వల్ల నే అవివేకంగా చేశావ్...లేకపోతే నాకు పెళ్ళయిఅత్తవారింటికి వెళ్లింతరువాత నన్ను గురించి ఆలోచించటం...నిద్రాహారాలు మానటం...విలపించటం...మతి పోగొట్టుకోటం దేనికి?? అవును నీకు మతి వుంటే... మొదటే ధైర్యంతో మీవాళ్లతో చెప్పేవాడివి...నిజంగా నే నీకు మతి లేదు...నీకు మతిపోయింది... నా పెళ్లి అయింతరువాత నావల్ల కాదు...నీకు పుట్టుకతో నే మతి లేదు" అంది రాధ.

"లేదూ..నన్ను హేళనచేస్తున్నావా... నువ్వు...నువ్వు..." అని పెద్దగా అరవబోతుంటే గా.

"మర్యాదగావెళ్లిపడుకో...నీబోటివారికి ఆశ్రయమివ్వటం మావారి మంచితనం వల్ల. ముందు నువ్వొక్కక్షణించి వెళ్లు" అంది రాధ గర్జిస్తూ!!

వెళ్ళను...నాకు లేని సుఖం నీకు ఎందుకుండాలి- వీల్లేదు - నువ్వు నాలాగా విలపించాలి - తల నేలకు బాదుకు చావాలి" అని మురళి లోపలికి అడుగు వేయబోతుంటే గా...

రాధ "ఛీ!" అంటూ తలుపులు దభీమని వేసేసింది.!

తలుపు సందుల్లో మురళి చిటికెన వేలు పడి నలిగింది! "అబ్బ" అన్నాడు!

చివరకు ఉక్రోషంతో, నిరాశతో... తనగదిలో కొచ్చాడు..వానలో తడుస్తూ... సొమ్మసిల్లి అర్థరాత్రికి నిద్రపోయాడు..." అంటూ శ్రీపతిగారు సరసవ్రాసిన కథ చివరి భాగాన్ని చదివారు.

శ్రీపతి గారి ముఖం గంభీరంగావుంది. సరస వనజగారు శ్రీపతి ముఖకవళికలబట్టి ఏ కథ ముగింపు నిజంగాజరిగిందో తెల్సుకుందామని పడ్డతాపత్రయం వృధా అయింది.

చివరకు శ్రీపతి "నేను జరిగిన కథ చెపుతాను వినండి" అని మొదలెట్టారు. "మరునాటి ఉదయం మురళిని కాఫీకి పిలవటానికి పనిమనిషిని పైకి పంపించాడు మురళి మిత్రుడు. మురళీ కాఫీ త్రాగటానికి క్రింద కొచ్చి కాఫీ తాగుతూ.

"రాత్రి ఎన్నిగంటలకు వచ్చావ్" అన్నాడు.

"ఒక గంటలో తిరిగివచ్చాను. మా ఆఫీసరు ఆఫీసులో పనిచేయటానికి రాలేదు. ఇవ్వాళ క్యాంప్ వెళ్ళబోతూ ఏవో కొన్ని విషయాలు చెప్పటానికి పిలిపించాడు. అంతే. అందుకనే అంత త్వరగా రాగలిగాను."

"పోనీ, వచ్చింతరువాత పిలవక పోయావ్ సరదాగా సినిమాకన్నా వెళ్ళేవాళ్ళం" అన్నాడు మురళి.

"పిలిచాను. నాలుగయిదు సార్లు తలుపు తట్టి పిలిచాను. కాని నువ్వు లేవలేదు. గుఱ్ఱుపెట్టి నిద్రపోతున్నట్లున్నావ్. సరే పోనీ, ప్రయాణంబడలికమీద పడుకొని వుంటావ్ అని తిరిగివచ్చాను." అన్నాడు మిత్రుడు.

"అబ్బ అంతనిద్ర పోయానన్నమాట. నాకు రాత్రి పడుకోటానికి మంచం మీదకు వెళ్ళటం జ్ఞాపకముంది. మళ్లీ కళ్లు తెరిచేసరికి తెల్లారింది" అన్నాడు.

"అయితే మాగదిలో హాయి గానిద్రపట్టిందన్నమాట," అంటూ "లే, మళ్లీ బజారు వెళ్ళి వద్దాం" అన్నాడు, మిత్రుడు," అని శ్రీపతిగారు ఆపేసి "ఇంతకూ ఆమురళిని నేనే. కాని ఆనాటి రాత్రి నాకు ఎలాంటి అభిప్రాయాలు, ఆలోచనలు లేకుండా హాయిగా నిద్రపట్టింది." అంటూ సిగరెట్లు అందిచ్చాడు. వనజ, సరసగార్లు తెల్లముఖాలేసి సిగరెట్లను గబగబా పీలుస్తున్నారు. పొగ యిద్దరి ముఖాల్ని కప్పివేసింది.

కాని కథ చెప్పిన శ్రీపతిగారు కూడ కథకులే. ★

కృష్ణమోహన్‌కి తూటా దెబ్బతగిలిన కొంతసేపటికి గస్తీ పోలీసులు అక్కడికి రావటం తటస్థించింది. వాళ్లు కారు దగ్గరకు వచ్చేటప్పటికి, కృష్ణమోహన్ మోటారు కారు స్టీరింగ్ చక్రం ఆనుకునిపడిఉన్నాడు. అతడి పక్కన కమలాక్షి, మధుసూదన్ నిలుచుని చూస్తున్నారు. వాళ్లకి కొంచం దూరంలో ఒక రివాల్వర్ కనపడింది. దానిలో ఒక తూటా మాత్రం కాల్చినట్టు కనపడింది. గస్తీ పోలీసులు వాళ్ళని ప్రశ్నించారు. రివాల్వరు కాల్పు విషయం ఏమీ తెలియదనీ, దానితో వాళ్లకు ఎలాటి సంబంధం లేదనీ చెప్పారు. అంతకుమించి వాళ్లు ఏమీ వాఙ్మూలంలో చెప్పలేదు.

పది నిమిషాల తరువాత ద్రాక్షపళ్లరసం తెచ్చి ఇచ్చింది నర్సు. ద్రాక్షరసం త్రాగాను. పత్రికలో చదివిన వార్తననుసరించే ఆలోచించడం ప్రారంభించాను.

నన్ను రివాల్వరుతో ఎవరు కాల్చిందీ ఊహించటానికి నేను ఎక్కువ శ్రమ పడలేదు. కమలాక్షి రివాల్వరు పేల్చిందని అనుకుంటారు. లేకపోతే, అసూయవల్ల ఆ పని మధుసూధనే చేసివుంటాడని అనుకోవచ్చు.

కాని నాకు అటువంటి అనుమానాలు కలుగలేదు. నామీద ఎవరు రివాల్వరు కాల్చిందీ నాకు తెలుసు. ఆ సమయంలో నేను ఎవరిని కలుసుకోవలసిందీ, నేను అక్కడికి వచ్చే విషయం ఎవరికి తెలిసిందీ కూడా నేను ఎరుగుదును. కోమలం తన మార్గంలోనుంచి నన్ను తొలగించటానికి ప్రయత్నించటంలో ఆశ్చర్యం లేదు.

వీళ్ళు ఇద్దరూ అప్పుడు అక్కడ ఏం చేస్తున్నారు? ఎందుకు వచ్చారు? అనే ప్రశ్నలకు సమాధానంకోసం నేను ఆలోచించాను.

మధుసూదన్ రాత్రిళ్లు ఎక్కడికైనా వెడతాడేమో అనే ఆలోచనతో అతడికి తెలియకుండా ఆమె వెనకనుంచి రావచ్చు. కాని మధుసూదన్ ఎందుకు వచ్చాడు? అతడు ఆ సమయంలో అక్కడికి రావటానికి సరిఅయిన కారణం కనపడలేదు.

ఎంతసేపు ఆలోచించినప్పటికీ, నేను తేలికగా బయటపడతాననే ధైర్యం నాకు కలగలేదు. నేనుచేసిన నేరం నాకు తెలుసు. కాని కమలాక్షి ఈ విషయంలో చిక్కుకుంది. నాకు ఆమె విషయమై ఆందోళన కలిగింది.

మధ్యాహ్నం రెండు గంటలకు పాండ్య వచ్చాడు. బల్లమీద వున్న పత్రికను ఆయన తీసుకొని చదివి తిరిగి అక్కడ పెట్టాడు. ఆయన తనకుర్చీ నా మంచం దగ్గరకు లాక్కుని కూర్చున్నాడు.

“నేను ఆఫీసుకు వెళ్ళాను. అక్కడ కొన్ని తొందర పనులు చూసుకొని, వచ్చాను,” అన్నాడు.

జవాబు చెప్పాలనిపించలేదు. అందుకని విని వూరుకున్నాను.

“కృష్ణమోహన్, నీకు తెలియని కొత్త విషయాలు కొన్ని నీతో చెప్పాలనివచ్చాను. విను. నిన్న రాత్రి రివాల్వరుతో నిన్ను కాల్చిన మధుసూదన్, డాక్టర్ చంద్రశేఖర్‌ని కూడా హత్యచేశాడు. అతడి విషయంలోనే మాకు అనుమానం వుంది. అతడివల్ల ఏమైనా తెలుస్తుందేమోనని ప్రయత్నం చేశాము. ఇతరత్రా కూడా ఆధారాలు సేకరించి పరిశోధిస్తున్నాము. డాక్టరు చంద్రశేఖర్ కేసులో అతడికి ప్రధాన పాత్ర వుంటుంది,” అన్నాడు పాండ్య.

 

# అపరబుద్ధి



"ఇది నిజమేనా?"

"సందేహం దేనికి? అసలు నేను యీ సంగతే నీతో చెప్పాలనుకున్నాను. కాని మన మేనేజింగు డైరెక్టరు ఈ విషయాలన్నీ రహస్యంగా వుంచాలనీ, మన ఏజంట్లకు కూడా తెలియపరచకూడదనీ, నాతో గట్టిగా చెప్పారు. అందుకే, ఇంతకుపూర్వం నేను నీతో కూడా ఈ విషయం చెప్పలేదు. ఆ రోజున నీ ఎదట మేనేజింగు డైరెక్టరుతో నా అభిప్రాయం బల్లగుద్ది చెప్పలేదు? ఇది మామూలువిషయం కాదనీ, నాకు యేదో బలీయమైన అనుమానం వుందనీ అనలేదూ?"

"ఇంకా ఏం తెలిసింది?"

"నీ సొంతకంపెనీ రికార్డులు, వ్యవహారాలు పరిశీలించారు."

"అట్లాగా?"

"మేనేజింగు డైరెక్టరుకు, నాకూ నీమీద సంపూర్ణమైన విశ్వాసం వుంది. ఈ కేసులో మా ఇద్దరికీ నీమీద ఏకాభిప్రాయం కుదిరింది. మధుసూదన్ వ్యవహారం నీకు తెలిసివుంటే, నీవే మాతో చెప్పేవాడివి. ఆ విషయం మాకు ఇవ్వాళే ఈ సంఘటనతో బయటపడింది. ఈ కేసుకు అదే ఆధారం."

"అతను అప్పు తీసుకున్నాడు."

"అతను అప్పు తీసుకోవటం కాదు మనకు ప్రధానమైనది. చంద్రశేఖర్ భీమాపట్టా నీవు తీసుకువెళ్ళిననాడు, అతను నీ ఆఫీసుగదిలో ఉన్నాడు. అవునా?"

"నాకు ఆ విషయం బాగా జ్ఞాపకం లేదు."

"మాకు నమ్మకంగా తెలుసు. నీ కంపెనీ మేనేజరును అడిగి, అక్కడి రికార్డులు చూసి ఈ విషయం మేము రూఢిచేసుకున్నాము! అప్పుడు నీ గదిలో మధుసూదన్, కమలాక్షి ఇద్దరూ ఉన్నారు. దీనివల్ల, తరువాత జరిగిన సంఘటనలతో సమన్వయం చేయటానికి మాకు ఆధారం దొరికింది.

"ఏమిటీ ఆ ఆధారం?"

"డాక్టరు చంద్రశేఖర్ తాను భీమా చేసిన విషయం ఇంట్లో ఎవరితోనూ చెప్పలేదనే సంగతి నీవుకూడా ఎరుగుదువు. అతడి సెక్రటరీని విచారించి ఈ విషయమై ఒక నిర్ధారణకు వచ్చాము. కాని అతని కుటుంబంలోనివాళ్ళకు ఈ విషయం తెలుసు."

"ఆ సంగతి నాకు తెలియదు."

డాక్టరు చంద్రశేఖర్ భీమాచేసినవిషయం అతడి ఇంట్లో అందరికీ తెలుసుననే అంశం, చివరికి ఇప్పుడు నిర్ధారణ అయింది. ఈ ఆధారం చాలు."

"ఏ న్యాయస్థానమైనప్పటికీ, తనకు తెలిసినదే భావించి తీర్పు ఇస్తుంది," అన్నాను.

"నేను న్యాయస్థానం కాదు. నా అనుభవంవల్ల, పరిశీలనవల్ల తెలుసుకున్న విషయాలు ఒకసారి సమగ్రంగా ఒక్కొక్క సంఘటనను తరువాత జరిగిన సంఘటనలతో సమన్వయంచేసి నా అభిప్రాయాన్ని గురించి పునరాలోచన చేసుకుంటున్నాను. నాకు అంతరాత్మపై విశ్వాసంవుంది. నా అంతరాత్మ చెప్పే ఆధారాన్ని పురస్కరించుకుని విచారణ జరపాలని కోరుతాను. నా అనుమానానికి సహేతుకమైన ఆధారం దొరకాలి. అన్నిటికంటే మరొక విచిత్రం! అతడి కూతురికి కూడా ఈ కేసులో సంబంధం వుంది."

"ఎవరికి? కూతురుకా?"

"అవును. కమలాక్షి, డాక్టరు చంద్రశేఖర్ కూతురు. ఆమెకూడా అప్పుడు నీ ఆఫీసులో వుంది. కూతురు, తన తండ్రిపై జరిగే హత్యాప్రయత్నంలో చేరుతుందని నేను చెప్పటం నీకు విచిత్రంగా కనబడవచ్చు. కాని ఈ కేసులో అలాగే జరిగింది. డబ్బుకోసం, ఇటువంటిపనులు ప్రపంచంలో అనేకం జరుగుతుంటై."

"నేను నమ్మను."

"నీకే తెలుస్తుంది. ఈ కేసు విచారణకు వచ్చినపుడు, వాళ్ళకి నీ సాక్ష్యం అవసరం. నాకు తెలుస్తూనేవుంది; కాని..."

"కాని ఏమిటి?"

"వాళ్ళని గురించి నీకు ఏమి తెలుసని, వాళ్లు నిన్ను ప్రోత్సహించి తొలగించటానికి ప్రయత్నిస్తారు? వాళ్లు కేవలం ఆ సమయానికి నీ ఆఫీసు గదిలో వుండటం చాలదు. ఇంతకంటే బలవత్తరమైన ప్రయోజనం వుండితీరాలి. ఏమిటది?"

"ఏం లేదు. అటువంటిది ఏదీ వుండటానికి అవకాశం లేదు."

"ఏదో వుండితీరాలి. ఇంకా మనకు కొద్దిరోజులు వ్యవధివుంది. జ్ఞాపకంచేసుకో"

ఇప్పుడు పాండ్య ఆవేశంతో మాట్లాడుతున్నాడు. అతని చేతులు నా మంచంమీద ఉన్నవి. అతని ఉద్రేకానికి నా మంచం కదులుతూంది. రెండునిమిషాల తరువాత అతడు లేచి నిలుచుని సిగరెట్టు వెలిగించి, గదిలో పచార్లుచేయటం ప్రారంభించాడు.

"మనకు వున్నవ్యవధి కొద్దిరోజులు మాత్రమే. కనీసం ఒక వారంరోజులపాటు కట్టుకట్టితేగాని, నీవు తిరిగి లేచి విచారణనాటికి రాలేవు. మనకు ప్రస్తుతం కావలసింది వ్యవధానమే. వీళ్ళిద్దరిని నిర్బంధంలో వుంచిన పోలీసులు నయాన, భయాన దండించి కొన్నివిషయాలు వీళ్ళవల్ల తెలుసుకుంటారు. ముఖ్యంగా అతడి కూతురు కమలాక్షి వెంటనే బయటపడాలి. అప్పటితో మనపని తేలిక అవుతుంది. మనం దినికోసమే ఎదురుచూస్తున్నాము. మరికొన్ని సంగతులు ఈ రాత్రికే తెలియాలి."

నేను కళ్లుమూసుకున్నాను. నా కళ్ల ముందు కమలాక్షి కనపడినట్లు తోచింది. పోలీసులు ఆమెను కొరడాలతో కొడుతూ వుంటారేమోనని నాకు స్ఫురించింది. ఈ హత్య విషయం ఆమెకు ఏమీ తెలియదు. ఆమెకు తెలియని విషయాన్ని ఆమె నోటివెంట చెప్పించాలని పోలీసులు ఆ నిరపరాధిని రక్తం వచ్చేటట్టుగా కొరడాలతో కొడతారు. నేను తరువాత ఏమగున్నదీ ఊహించలేకపోయాను. మెదడు మొద్దుబారింది. కన్నీటి ప్రవాహంతో ఆమెముఖం నాకు కనపడింది. కళ్లుమూసుకున్నాను అకస్మాత్తుగా దగ్గవచ్చింది. నోటివెంట రక్తంకారుతూంది.

"పాండ్యా! చూడండి–"

"చెప్పు! ఇక్కడే ఉన్నాను."

"ఇంకా చెప్పవలసిందివుంది ఆ విషయాన్నిగురించి," అన్నాను.

(55-వ పేజీ చూడండి)

# వనితా లోకం

## పిల్లలూ - చదువులూ

ప్రతీవారూ తమ పిల్లలు ఉన్నతస్థాయిలో చదువుకొని ఉండాలని తలచుతూ ఉంటారు. పిల్లలు సరియైన శిక్షణ పొందితే గాని ఉన్నతస్థాయిలోకి రారుకదా. పిల్లలు ఉన్నతస్థాయిలోకి రావాలంటే తల్లి తండ్రులు చిన్నప్పటినుంచీ జాగ్రత్త వహించాలి.

చాలామంది తమ పిల్లల వయస్సు, తాహతు గుర్తించరు. గుర్తించక ప్రక్కవారి అబ్బాయిని పంపారని రెండో మూడో చదువుతున్న కుఱ్ఱవాడిని ఫస్ట్‌ఫారమ్ ఎడ్మిషన్ పరీక్షకు పంపుతారు. అందులో వాడు తప్పితే చావకొడుతారు. ఎద్దూ మొద్దూ అని దురుసుగా మాటలు అని నొప్పిస్తారు. అంతతో ఊరుకోక ఊరులో పలుకుపడి ఉన్నవారిచే హెడ్‌మాస్టర్‌కు సిఫార్సు చేయించుతారు. ఇంతచేసినా ఆ కుఱ్ఱవాడు ఎడ్మిట్ అవడు. అసలు ఈడు, వాడిశక్తి ఎంతో తల్లి తండ్రులు గుర్తించరు.

సాధారణంగా చిన్నప్పుడు ఇంట్లో లొంగని పిల్లలకు ప్రెయివేటు పెట్టించుతారు. అక్షరజ్ఞానమున్న ప్రతి నిరుద్యోగి ఇప్పుడు టీచరుక్రిందే రూపొందుతున్నాడు కదా. ఇలాంటి టీచరును కనుక, పెడితే అతడు పిల్లవాని వయస్సు తాహతు గుర్తించక 6 సం॥ల కుఱ్ఱవానికి ఒక వందలెక్కలు హోంవర్క్ ఇస్తాడు. తంతాడని ఆపిల్లడు చేయలేకా ఇంట్లోవాళ్లు చేయించలేక బాధపడతారు. టీచరకు డబ్బుఇచ్చుకున్నా, ఇంట్లోవాళ్లు ఎలాగా పిల్లాడికి గంటైనా చదువుచెప్పక తప్పదు.

కొందరు, పిల్లలకు త్వరగా అన్నీ వచ్చి వేయాలని తెలుగు, ఇంగ్లీషు, లెక్కలు, అన్నీ ఒక్కసారి నేర్పించుటకు మొదలెడుతారు. అన్నీ నేర్చుకోలేక ఆ చిన్న కుఱ్ఱవాడు చదువుకు నామంపెడతాడు. చిన్నప్పుడు చదువుచెప్పడం ఏమంత కష్టంగాదు. పిల్లలను దగ్గరలోఉన్న స్కూలుకు పంపి ఇంటివద్ద మనం ఒక ½ గంట చెపితేచాలు. పిల్లలను చిన్నప్పటినుంచి మాటలతో నచ్చచెప్పటం నేర్చుకొని సాధ్యమైనంతవరకు కొట్టకుండా ఉండాలి. కొడితే ప్రతీదానికి దెబ్బలు తినాలికదా అని లెక్కచేయరు.

ఈ కాలంలో పిల్లలు విధిలేక చక్కగా ముస్తాబయి బడికివెళతారు. అక్కడ ఇష్టం వచ్చినట్లు నడచి చివరకు పరీక్షలలో తక్కువ మార్కులు తెచ్చుకుంటారు.


ఎం. వి. లక్ష్మి

(వాల్తేరు)


ఇంటివద్ద తంతారు అని దొంగసంతకంపెట్టి ప్రోగ్రస్ కార్డు టీచరుకు ఇస్తారు. లేదా మార్కులు (తెలివిగా) చెరిపి తమకు తోచినన్ని వేసి సంతకం పెట్టించి తిరిగి చెరిపి మళ్ళీ అసలు మార్కులువేసి టీచరుకు ఇస్తారు. ఇది ఏటీచరైనా కనిపెట్టినాడా అప్పుడు ఇంక బుఱ్ఱఎత్తకుండా చేస్తాడు. చిన్నప్పుడు వారికి కొంచెము మార్కులు వచ్చినా పెద్దలు, మావాడు చాలా గొప్పగా చదువుతాడు. తెలివైనవాడు అని పదే పదే పొగుడుతారు. వారు తెలివైనవారం అని చదవడం మానేసి ఇలాంటిపనులు చేస్తారు.

మొహమాటాలు ఎక్కువగాగల ఈ రోజులలో ఒక అబ్బాయి తనదగ్గర ప్రయివేట్ చదువుతున్నాడూ అంటే వాడికి పేపరు చెప్పకపోయినా, ఫస్టుమార్కు తన పేపరులో వేయకపోయినా, సున్నావచ్చేవారికైనా 50% మార్కులు వేయకపోయినా తనవద్ద అబ్బాయిని ప్రయివేట్ మాన్పించుతారని కొందరు టీచర్లు మొహమాటం కొద్దీ ఇలాటిపలు చేస్తున్నారు.

కొందరు పిల్లలను చిన్నప్పటినుంచీ మేష్టర్లదగ్గర తృణమో, ఫణమో పెట్టి మీదకు తోయించుతారు. వాడు మెల్లిగా ఎస్. ఎస్. ఎల్. సి. దాకా వస్తాడు. పబ్లిక్‌లో వాడికి స్లిప్‌లు వ్రాసిచ్చి, అది వాడు కాఫీ చేస్తూఉంటే చూచి ఊరుకోవాలని వాచరును మొహమాటపెట్టి ఎలాగో పేసయితే చాలు అని చూస్తారు. ఈవిధంగా పేసయిన కుఱ్ఱాడు పై చదువుకు పోయాడా మరి జన్మలో ప్యాసవడు. కాపీ చేయనీయక పోయాడా వాచరు ఇంటికి కాళ్లూ చేతులతో చేరడు.

తమ పిల్లలు చక్కగా చదువుకొని స్వయంగా పాసవాలంటే, చిన్నప్పటినుంచి పైన ఉదహరించిన విధంగా కుఱ్ఱకు నడవకుండా ఉండునటుల చాలా జాగ్రత్తగా చూచుకోవాలి. పిల్లలకు ప్రయివేటు పెట్టినా మనం కొంచెం చూచుకోవాలి. ప్రయివేట్ పెట్టేము మేష్టరే చూచుకుంటాడు అనుకోరాదు. జాగ్రత్తగా చదివించుకొంటే పిల్లలు తప్పక ఉన్నతస్థాయిలోకి వస్తారు. ★

# కన్యలెలా ఉండాలి

పులగంపల్లి లక్ష్మి

పరమాత్ముని పరమోత్కృష్ట వర ప్రదానం సంతానం. "జనవినుత యగ్నిహోత్రంబును సంతానమును వేదములు నెడతెగగా జనదు తమ వంశజులకు ననిరి మహాధర్మనిపుణులైన మునీంద్రుల్" అని భారత సూక్తి. అందులో కన్య శ్రేష్ఠము. కన్య మానవజన్మలో కోమలమైన మహాపవిత్రావతారం. కన్య జన్మించిన గృహం నిత్యమంగళ వైభవంతో కూడి వుంటుంది.

సర్వసాధారణంగా కన్య జన్మించిందనడముతోటే ముఖం మాడ్చుకొనేవారున్నారీరోజుల్లో. ఏదో గొప్ప దుర్ఘటన జరిగినంతయిదిగా బాధపడతారు. జన్మించిన కన్యలు పరాయివారనే భావం మొదట కలుగుతుంది. అప్పటినుండే కొంత ఉపేక్షాభావంతోటే చూస్తారు. పెరగడం, పెద్దకావడం, వివాహం జరగడం-ఇవే ముఖ్య విషయాలుగా వుండిపోతాయి.

ఆదరాభిమానాలు అమితంగావున్న తలితండ్రులు కూడా ఆడసంతానానికి ఉన్నత విద్యా సౌకర్యాలు కలిగించలేకపోతున్నారు. వివాహానికి సంబంధించిన అన్ని విషయాలూ-అందుకు తగిన ప్రయత్నాలూ- చేస్తుంటారు. నగలు నాణ్యాలూ లభించే ఇంటికే బిడ్డనివ్వాలని ఆశించేవారు మరీ ఎక్కువ.

శారీరక శాస్త్రజ్ఞుల అభిప్రాయాన్ననుసరించి బాలురకంటెను బాలికల శరీరంలో మానవీయకళలు పూర్ణవికాసాన్నందుకొన్నాయట. శారీరకంగానూ, మానసికంగానూ, బాలికల అంగాల్లో అవయవపూర్ణత్వం వుంది. పవిత్రమూర్తులు కన్యలు.

సాధారణ కుటుంబాల్లో బాలికలు చాలా నికృష్టంగా పోషించబడుతూ వుంటారు. అన్నదమ్ముల చీవాట్లు భరించవలసివుంటుంది. ఓరిమి, త్యాగము, బాలికలసొత్తు. వయసు హెచ్చినట్లల్లా వారి సహనశీలత హెచ్చుతుంది. తలితండ్రుల ఇష్టాయిష్టాలపై తను ఆధారపడి వుండాలి.

బాలికలు గంభీరమయిన, సున్నితమయిన కఠినమయిన జీవితం గడపడం నేర్చుకోవాలిసివుంటుంది. పెళ్లయిందనగానే- అందరూ రాణీలయిపోతారనే దేముంది. దారిద్ర్య జీవితానికే గురికావలసి వస్తుంది. అన్నిటికంటే మించింది మాతృస్థానాన్ని పొందడం ముందుకు వుంది. తన సంతానానికి రక్తమాంసాలు పంచిఇవ్వాలి. తల్లి ఆత్మయే బిడ్డల ప్రతిబింబం. ఇలాంటప్పుడు కన్యలనేవిధమయిన పోషణయందుంచాలి. శైశవదశనుండీ యీ దశ వరకూ ఆహార, విహారాలెంతమంచివియై యుండాలి? అనువైన



వాతావరణ స్థితిని కలిగించడమెలాగ? బాలురపై చూపినంత శ్రద్ధ బాలికలపై చాలునా?

ఆహారం:— బాలికల శరీరం అందంగానూ, కోమలంగానూ, మృదువుగానూ అంగసౌష్ఠవం కలిగి, దేహం కాంతివంతంగా వుండాలంటేనూ,

వెంట్రుకలు, పెదవులు, దంతములు, గోళ్లు, కళ్లు లోపరహితంగా ఉండాలంటేనూ,

కంఠస్వరం కోమలంగా, మధురంగా, ఇంపుగానూ, శ్వాసోచ్ఛ్వాసాలు, చెమట బిందువులు, సువాసనకలిగి వుండాలన్నాను,

శిష్టాచారానికి లోబడిన అలవాట్లు, మర్యాదా, పాటించే యోగ్యతకలిగి వుండాలన్నా,

నిత్యకృత్యాలు, నియమబద్ధంగా పరిస్థితిననుసరించి, జరుపుకొనే నేర్పరితనం రావాలన్నా, తిండితీర్థాలు, తల్లితండ్రుల తీరుతెన్నులు, పోషణవిధానాలు ఇంటి వాతావరణం సరియైనవియై వుండాలి.

మూడుసంవత్సరాలకు లోవయస్సున్న బాలికలకు రోజుకి మూడు పర్యాయాలకెక్కువ ఆహారం ఇవ్వకూడదు. సరియైన సమయానికిచ్చే ఆహారం సరియైన నిద్రనివ్వగలదు. భోంచేసేటప్పుడుకాని భోంచేసిన వెంటనేకాని అమితంగా నీళ్ళు త్రాగనివ్వరాదు. ఎక్కువనీళ్ళు త్రాగినందువల్ల భవిష్యత్తులో వయస్సుకు తగినంతకన్నా లావుకావడము—ఋతుధర్మం సరిగా నెరవేరకపోవడము—వెలిపోయిన శరీరచ్ఛాయ—సంభవిస్తాయి. పొట్టపెరిగి సహజమైన అందం వుండదు.

అయిదుసంవత్సరాల వయస్సువచ్చినతరువాత ఉదయం పాలు, సాధ్యమయినంత వరకూ యివ్వాలి, మధ్యాహ్నం మామూలు భోజనం, అల్పంగా భుజింపజేయాలి, కూరి కూరి పెట్టకూడదు. స్వంతంగా స్వతంత్రంగా భుజించునట్లు చూడాలి, పాలు, పెరుగు, మజ్జిగ యథేష్టంగా త్రాగనివ్వాలి. మిఠాయిలాంటి తీపుపదార్థాలు తక్కువ వాడాలి, మసాలాతో కలిసిన పదార్థాలు ఎంత తగ్గించిన అంతమంచిది.

పగటి నిదుర గట్టిగా అరికట్టాలి, పగటి నిదుర సోమరితనానికి దారితీస్తుంది. హృదయం రానురాను బలహీనమైపోతుంది. రక్తప్రవాహంలో మార్పుకలుగుతుంది. శరీరచ్ఛాయ, చర్మము యొక్క మృదుత్వం తగ్గిపోతాయి. వేసవికాలంలో కూడా పగటినిదురకు అలవాటు పడనివ్వరాదు.

స్నానానికి ప్రత్యేకగది వుండితీరాలి. అది అన్నివైపులా మూయబడివుండాలి. 5, 6 సంవత్సరాల వయస్సు వచ్చేవరకూ తల్లితో కలిసి స్నానం చేయించవచ్చు. తరువాత స్వయంగా స్నానం చేసేటట్టు చూడాలి.

నిదురించే గదులు కూడా కన్యలకు ప్రత్యేకంగా వుండడము చాలా మంచిది. 5, 6 సం॥ పైబడిన తరువాత ఎటువంటప్పుడయినా వివస్త్రగా వుండనివ్వరాదు, బిజ్జుగా

# వక్కసూర తయారీ

భోజనాలయిన వెంటనే తాంబూలము వేసుకునే అలవాటు చాలామందికుంటుంది. తాంబూలము పొరపాటున మానితే బాధపడుతారు. బజార్లో సామాన్యంగా ఒక అణా మొదలు ఐదు రూపాయలవరకు కిల్లీకట్టి అమ్ముతారు. కిల్లీయొక్క రుచి వక్కసూరనుబట్టీ, దానిలో కలిపే సుగంధ ద్రవ్యాలను బట్టి వస్తుంది. భోజనము కాగానే తాంబూలమేసుకుంటే ఆహారం సులభంగా జీర్ణమవుతుంది.

గ్రంథాలనుబట్టి శ్రీ కృష్ణదేవరాయల కాలంలో ప్రజలంతా, తాంబూలము, నిత్యావసరముగా వాడేవారని తెలియుచున్నది. ప్రతినిత్యము బజార్లో కొని కిల్లీలు వేసుకుంటే ఒక్కొక్కరి సంపాదన కిల్లీలకే చాలదు. అట్టివారికి మనం ఇంట్లోనే వారి కిల్లీకి కావలసిన సామగ్రినంతా సమకూర్చి వేళకు తాంబూల మందిస్తే వాళ్లు సంతోషిస్తారు. మన ఖర్చులు తగ్గుతాయి.

కిల్లీకి కావలసిన ముఖ్యసామగ్రులు ఆకు, వక్క, సున్నము మాత్రమే. కానీ ఇలాంటి తాంబూలము రుచి నివ్వదు. సుగంధ ద్రవ్యాలతో జేర్చిన మలిన నోటి కంతో రుచిగా నుండును. అతిథి మర్యాదలకును, పూజా సమయమున దేవుని యొద్దను ఆకులు, వక్కలు వాడెదరు. రాయలనాటి కాలపు ప్రజలు తాంబూలము వేసుకొని దేవుని పూజించెడివారట. అతిథులకు కస్తూరి తాంబూలమిచ్చి గౌరవించెడివారట. మన ఇంట్లో ప్రతినిత్యము తాంబూలము వేసికొనుటకు కిల్లీ కొట్లలో దొరికినట్లు సుగంధద్రవ్యములు దొరకకపోయినను, మన నిత్యానందమునకు మనము వాడే తాంబూలమునకు

## పొత్తూరు సీతామహాలక్ష్మి

(తెనాలి)

ఏ కొద్ది సుగంధద్రవ్యములను చేకూర్చుకున్నను చాలు. ముఖ్యంగా తాంబూలపు రుచి వక్కసూరపై ఆధారపడియుంటుంది.

వక్కసూర తయారుచేయు విధము:

కావలసిన సామగ్రులు

½ సవాసేరు వక్కలు.
5 తులముల నెయ్యి.
ఒక అణా గసగసాలు.
ఒక చిన్న కొబ్బరిచిప్ప.
ఒక అణా కుంకుమపువ్వు.
గుప్పెడు దోసగింజల పప్పులు.
గుప్పెడు చారపప్పులు.

ఈ కొద్దిపాళ్ళలో ముందు తయారు చేసుకొని తరువాత పెద్ద మొత్తములుగా తయారు చేసుకొనవచ్చును. వక్కలను మంచినీటిలో శుభ్రముగా కడిగి ఎండబోయాలి. వక్కలు ఎండిన తరువాత గుండ్రాయితో సూరగా కొట్టవలెను. సన్నని పిండి సూరనుండి తొలగింపవలెను. సన్నని పిండి వేరే విధముగా ఆకులకే ఉపయోగించుకొనవచ్చును. కొబ్బరి చిప్పను తురిమి సిద్ధముగా నుంచుకొనవలెను. తరువాత కళాయిగిన్నె పొయ్యిమీదపెట్టి నెయ్యి వేసి (4 తులములు) వక్క సూర సన్నని మంటతో వేయించి సువాసన రాగానే వేరొక కళాయిపళ్ళెములో పోయవలెను. కొబ్బరి తురుము కొంచెము నెయ్యి వేసి దోరగా వేయించి వక్కసూరలో కలుపవలెను. గసగసాలు మిగిలిన నేతితో వేయించి దానిలో కలుపవలెను. ఆ పళ్ళెములోనే దోసపప్పులు, కుంకుమపువ్వు, చారపప్పు వేసి కలిపి సువాసనవచ్చుటకు అత్తరు (రోజా వాటర్) కలిపిన మంచిది. అన్ని కలియబెట్టిన వక్క సూరను సీసాలో పోసుకొని వుంచుకుంటే చాలా కాల ముంటుంది. వక్క సూర అయిపోయి నప్పుడల్లా మనము తయారు చేసుకుంటే ఖర్చుకూడ స్వల్ప మవుతుంది. ★

---

బిగించిన గుడ్డలు ధరింపచేయడం అసలుకే మంచిదికాదు. లంగాలు నాభివద్ద సరిగా కట్టుకొనునట్లు చూడాలి, పడక గిలిగింతలు పెట్టు నటువంటిదిగా ఉండరాదు. సాధ్యమయితే ఎత్తయిన తలగడ లేకుండా చేస్తే మంచిది. రక్తప్రవాహం మస్తిష్కానికి పోయేటంత ఇదిగా తలగడ వుండినా చాలు, పై కప్పడము శుభ్రంగా ఉతికినదై తెల్లనిదై యుండాలి. ఇతర బాలబాలికలతో కలిసి నిదురించునట్లు చూస్తే కొన్ని దురలవాట్లు అనుకొనని విధంగా సంభవిస్తాయి. అలాంటి వాటికి అవకాశముంది. తేలికయిన తెల్లని దుసులు ధరింపజేయడం ముఖ్యం. కావాలంటే తేలిక రంగులు కలిగిన ఇతర గుడ్డల వాడకం అరుదుగా వుండాలి. 10 సం॥ పైబడిన వారికి అన్ని విషయాలకు తగినట్లు ప్రత్యేక గది నివ్వాలి. అందులో తమగుడ్డలు పుస్తకాలు స్వయంగా సరిదిద్దుకొనే అవకాశం కల్పించాలి. అలాంటి అలవాట్లు వారికి పసితనం నుండే రావాలి.

బాలికలు, కోమల, మధుర హృదయంగల వారు. ఏ చిన్న విషయమైనా వారిని అట్టే ఆకర్షిస్తుంది. వెంటనే ఆ విషయానికి అనుకూలురైపోతారు. చాలా జాగ్రతగా వారి పరిసరాల్ని, వ్యవహారాల్ని చాలా ఉత్తమమై వుండునవిగా చూడాలి. అలాంటి అనుకూల పరిసరాల్లో పెరిగిన కన్యలు దేవతలు. అందరి మన్ననలందుకుంటారు. (సశేషం)



ప్రముఖ చిత్రకారిణి:
శ్రీమతి శ్యామసుందరీ దేవి

# ధార్తరాష్ట్రులు ధూర్తులెందుకయ్యారు?

**పి. లలిత**
(బొబ్బిలి)

భారతమనగానే కౌరవులు, పాండవులు, జ్ఞాపక మొస్తారు ఎవరికైనా. దానివెంటనే కౌరవులు దుర్మార్గులని, పాండవులు మంచివారనికూడా స్ఫురిస్తుంది. కౌరవులు దుర్మార్గులగుటకు, పాండవులు మంచివారగుటకు కారణమేమిటో కొంత ఆలోచిస్తేగాని అర్థంకాదు. ఉభయులు ఒకే గురువుదగ్గర విద్యాభ్యాసము చేసినారు. ఉభయులు భీష్మాది కురువృద్ధుల శిక్షణలోనే పెరిగి పెద్దవారైనారు. కాని పాండవులు ధర్మవర్తనులగుటయు, కౌరవులు అధర్మవర్తనులగుటయు జరిగినది. ఆశ్చర్యముగా ఉండదూ. అందువలన పుట్టుకతోనే వారలకు ఆయా గుణాలు లబ్బినవని అనిపిస్తుంది.

వారి తల్లితండ్రుల గుణములు పరిశీలిస్తే ధృతరాష్ట్ర పాండురాజుల గుణములకు ఎక్కువ భేదము కన్పించదు. కాని గాంధారికి, కుంతికి మాత్రము చాలా తేడా కన్పిస్తుంది. ఇరువురు మహారాజ పుత్రికలే. జిత్తులమారియు, పరమ ఈర్ష్యాళువు అయిన శకుని గాంధారి సోదరుడు. మహానుభావుడు, ధీశాలి అయిన వసుదేవుని చెలియలు పృథయే కుంతి భోజుని దత్తపుత్రికయైన కుంతి. దైవవశమున, సకల సద్గుణరాశియైన కుంతీదేవి మహా పతివ్రతగా పేరుగాంచలేకపోయినది.

కుంతియు, గాంధారియు ఒకేసారి గర్భము ధరించినారు. కుంతీదేవికి ధర్మరాజు జన్మించినాడు. మరల కుంతీదేవి గర్భము ధరించినది. ఈ సంగతి గాంధారికి తెలిసినది. తనకేమో సంతానం కలుగలేదు.

గాంధారి, అసూయను ఆపుకొనజాలక గర్భము మోదుకొన్నది. గర్భము 100 శకలములైనది. మహానుభావుడైన వ్యాసమహర్షి ఈ విషయము దివ్యదృష్టిచే గ్రహించి వచ్చి గాంధారిని మందలించి ఆశకలములను శిశువులుగా చేసినాడు. వారే దుర్యోధనాదులు. గాంధారిలో బీజప్రాయమైన ఆ అసూయయే దుర్యోధనునిలో మహావృక్షమై వేళ్ళు పాతుకొని వంశక్షయమునకు కారణమైనది. కుంతీదేవిపై ఈర్ష్యచే గర్భము మోదుకొనిన గాంధారికి జన్మించి దుర్యోధనాదులకు, ఆ కుంతీదేవి తనయులపై అనురాగమెట్లు కలుగుతుంది?

అసూయ తప్ప, దుర్యోధనునిలో వేరే దుర్గుణము ఏఒక్కటీ కానరాదు.

ఇక కుంతీదేవియో, దూర్వాసునంతటి మునికోపిని తన పరిచర్యచే మెప్పించినది. తనకు దూర్వాసుడిచ్చిన మంత్రమును తన సవతియైన మాద్రిదేవికి ఉపదేశించి ఆమెకు కూడా సంతానము కలుగుటకు తోడ్పడిన విశాలహృదయ మాత్సర్యరహితురాలు. ఆ కారణముచేతనే మాద్రి తన సంతానమును కుంతీదేవిచేతిలో నిడి నిశ్చింతంగా పాండుమహారాజుతో సహగమనముచేయ గలిగినది. తాను కన్న సంతానమైన ధర్మజ, భీమార్జునులకన్నను యెక్కువగా, నకుల సహదేవులను ప్రేమించిన ఆదర్శమాత కుంతి. విరాట పర్వములో అర్జునుడు విరాటరాజుకు సహదేవుని పరిచయముచేస్తూ "సుకుమార మానసుడు, కుంతికి ప్రాణము, ప్రాణమునకు, చేతోగణ్యుండు" అని చెపుతాడు. కౌరవ పాండవ యుద్ధానంతరము గాంధారీ ధృతరాష్ట్రులు అరణ్యమునకు వెళ్ళుచుండగా, అంతవరకు యెన్నో కష్టములనుభవించి కొలదికాలము క్రిందటనే మహారాజమాతయైన కుంతి, తన రాజమాతృత్వగౌరవాన్ని, సామ్రాజ్యభోగములను త్యజించి తన బిడ్డలకు యెన్నో ఇబ్బందులు కల్పించిన కౌరవుల తల్లితండ్రులనే భావముకూడా లేకుండా వారికి సేవచేయుటకు అరణ్యమునకు వెళ్లుతుంది.

చివరకు వారితోనే మరణిస్తుంది. అలాంటి కుంతీదేవి బిడ్డలు ధర్మవర్తనులగుటలో ఆశ్చర్యమేమున్నది? పావనమైన భరత వంశము కుంతీదేవి కోడలగుటచే పావనతరమైనదనినను అతిశయోక్తి కాదేమో. గాంధారియైనను సామాన్యురాలు కాదు. భర్త చూడలేని ప్రపంచమును తానును చూడనొల్లక కళ్లకు గంతలు కట్టుకొనిన మహా పతివ్రత. చివరకు తను కన్న సంతానము

## విలువైన సలహాలు

సబ్బు పొదుపుగా వాడుకోవటాన్ని గురించి చిన్న సూచన. సబ్బులు—అందులో మనము సామాన్యముగా స్నానమునకు వాడుకొనేవి - దీర్ఘచతురస్రాకారముగా వుంటవి. మనము అట్టి బిళ్లతో పెద్దగా, పొడుగు, వెడల్పు ఎక్కువయున్నవైపుతోనే వంటికి రాచుకుంటాము. అందువలన సబ్బుబిళ్ళయొక్క మందము మాత్రమే ఎక్కువగా అరిగి చివరికి ఒక పలుచని పొడుగైన ముక్క మిగులుతుంది. ఇది సులభముగా విరుగుతుంది-ఇంకా వంటిమీద వుపయోగించితే. దీన్ని పొదుపుచేయటానికి ఇంకొక క్రొత్తసబ్బుకు అతికిస్తే అతుకోదు. ఎందువల్లనంటే చేతిలోనించి, సబ్బుపెట్టెలోనికి జారి, దూకేటప్పుడు ప్రక్కలు అంచులుమాత్రమే అరిగి మన అరచేయిమధ్య పల్లము గనుక సబ్బుయొక్క మధ్యభాగము లావుగా వుంటుంది. అతుక్కునేవీలుగా చదునుగా నుండక. పోనీ, యీ విరిగిన ముక్కలు వుతికేనీళ్ళలో వాడటానికైనా, సరీగా కరుగక చిన్న చిన్న తుంపులుగా బట్టలకు అంటుకొని, రంగు పాడుచేయటమో లేక నేతను తినివేయటమో జరుగును.

మనము క్రొత్తసబ్బును వుపయోగానికి తేగానే పెద్దవైపుతో మాత్రమే అరుగదీయక, అన్నిటికన్న చిన్నవైపున-అనగా గోడిన-కూడా అరుగదీస్తూయుంటే చివరకు మిగిలేచెక్క దీర్ఘచతురస్రముగా ఉంటుంది. త్వరగా విరగదు. పోను పోను సమచతురస్రముగా తేలుతుంది. అప్పుడు ఆ మిగిలే ముక్క తుదివరకు మన్నుతుంది. విరగనీయకుండా, పారవేయకుండా చిన్నిపిల్లలు చిన్నిచేతులతో ఆఖరయ్యేవరకు వాడుకోవచ్చు. ఇట్లా వాడుకుంటే మనము ఇప్పుడు పారవేస్తున్న $\frac{1}{8}$ లేక 1/10 బిళ్లకూడా సొమ్ము చేసుకోవడమవుతుంది.

—రాయప్రోలు మాలతి.



# గృహవైద్యం



పసిపిల్లల విషయంలో చిడుము, కురుపులు. ఇవి బాధించినంతగా మరేదీ బాధించదు. అసలు మొదటిలోనే జాగ్రత్త మంచిది. ఆరునెలల పర్యంతం పసుపు రాసి నీళ్లు పోయటం ఉత్తమం. చిడుము లేక మరే ఇతర చర్మవ్యాధిని దగ్గరకు చేరనీయదు. చాయపసుపులో చీమపురుగు క్రిమిని నాశనంచేసే గుణం ఉంది. పసుపు ఔషధప్రాయమైనది. కూరలలో వాడితే ఆరోగ్యానికి మంచిది. బాలెంతరాలికి రాస్తే, కొత్తనెత్తురు పట్టేసమయంలో చర్మవ్యాధి దరికి జేరదంటారు.

తీరా చిడుము పట్టాక చిన్న పిల్లలకి కార్బాలిక్ సబ్బులాంటివి వాడటం వాళ్ళ సున్నితమైన దేహానికి మంచిదికాదు. కొందరికి వేడిన వస్తాయి (కాళ్లు చేతులికి) కురుపులు. ఆ బిడ్డల కాళ్లకి చేతులకి తడిగుడ్డలు కడితేచాలు నాలుగురోజుల్లో తగ్గిపోతాయి. మందులు అవసరంలేదు. మందులు వాడిన కొలది హెచ్చుతాయి. 'చందనీ' అత్తరు పైకి రాయవచ్చు.

మంత్రం, చప్పి వీటికి తులసి ఆకు పసరు చాలా శ్రేష్ఠం. తులసి ఆకు తొక్కి పసరు ఒక గిన్నెలో ఉంచుకుని, 10 మిరియాలు మెత్తగా నూరి ఆ పసరులో కలిపి రాస్తే దురద తగ్గిపోతుంది. మూడోనాటికి మాడిపోతాయి మంత్రం పొక్కులు. మంత్రికూడ అవసరంలేకుండా పనిచేసింది తులసి ఆకు. పాముకాటుకికూడా తులసిఆకు విరుగుడు అంటారు.

రోజూ ఉదయంవేళ నాలుగు తులసిదళాలు నోట్లో వేసుకు తింటే అనాదినుంచి ఉన్న కఫం (శ్లేష్మం) దగ్గులు నయమౌతాయి, చిన్నలకి, పెదలకి కూడా.

చర్మవ్యాధి కలవారికి తులసి పసరు పైకి పట్టించి జీలకర్ర వేయించి ఆ పొడిలో పటిక బెల్లం చూర్ణం కలిపి 3 పూటల సేవించితే త్వరగా నయమౌతుంది. పసిపిల్లలైతే ఏలకులు చూర్ణంచేసి నేతిలో కలిపి మూడు పూటల తినిపిస్తే మంచిది త్వరగా నయమౌతుంది.

పెద్ద పెద్ద మందులు, గంధకాలు, లాటి పసిపిల్లలకి రాయటం మంచిదికాదు.

తరచుగా పిల్లలు క్రిందపడి గాయాలు తగుల్చుకుంటూంటారు. ఒక పావలాడబ్బులు పెట్టి 'టించర్ అయొడిన్' కొని ఇంటిలో ఉంచుకుంటే ఖంగారుపడకుండా మనమే దూది వేసి కట్టు కట్టుకోవచ్చు. చీటికి మాటికి పిల్లల్ని తీసుకు డాక్టరువద్దకు పరుగెత్త నవసరం వుండదు. ఇరుగు పొరుగులక్కూడా మనం అప్పుడప్పుడు సహాయపడ్తూ ఉండవచ్చు. కత్తిపీట, బ్లేడు వీటివల్ల ఒచ్చే ప్రమాదాలకి కూడా అయొడెన్ బాగా పనిచేస్తుంది.

కె. పద్మజ
తాడేపల్లిగూడెం.

---

నైనను ఒకసారైనను చూచుకొనలేదా ఇల్లాలు. కాని యేమి లాభము? ఆమె పాతివ్రత్యము ఆమె బిడ్డల శ్రేయస్సుకు సహాయకారి కాలేదు. శ్రీకృష్ణుని శపించుటకు మాత్రమే తోడ్పడినది. గాంధారీ ధృతరాష్ట్రులు యేనాడూ ధర్మభీతిచే పాండవులకు అర్ధరాజ్య మిమ్మని దుర్యోధనునితో చెప్పలేదు. పాండవులు బలవంతులనియే ఇమ్మన్నారు. ఏదియేమైనా స్త్రీకి పాతివ్రత్యమెంత ప్రధానమో, ధర్మవర్తనమంత కన్నను ప్రధానమైనది. బిడ్డల శ్రేయస్సుకు ప్రధానమైనది తల్లి యొక్క మంచి శిక్షణయే కాదు, మంచి హృదయము కూడా. ★



లంగాలకు, చీరలకు అంచుల డిజైను:—
దేవరపల్లి బుజ్జమ్మ (ఆలూరు.)

ఉత్తరాలు:

# తరణోపాయం

6-3-57 వారపత్రికలో ద్వివేదుల విశాలాక్షిగారు వ్రాసినవ్యాసం చదివాను చాలా బాగుంది. ఆమె చెప్పినట్లుగా ఇన్ని కలతలు ఎందుకు వస్తాయంటె అధికారవాంఛ. ఆమె పరిష్కారమార్గం సూచిస్తూ ఏకొస్త భేదాభిప్రాయం కల్గినా అందరియందు చెప్పాలనీ దాన్ని అందరూ సామరస్యంగా ఆలోచించాలనీ రాశారు. అలా ఆలోచిస్తే చిక్కే లేదు. కాని అలా ఆలోచించరు సరికదా ఎవరైనా యదార్థం చెగితే ఎంత మాటంటే అంతమాట అందని ఆమెకి ఓర్పు తక్కువని తలా ఒకవిధంగా దుయ్యబడతారు. "యదార్థవాది బంధువిరోధి" అని ఒక సామెతవుంది మన తెలుగులో; అల్లా అవుతుంది ఆమె పని. యదార్థం కనుక చెప్పామంటె కలతలు ఎక్కువవుతాయే గాని తగ్గవు. ఏమంటె జరుగుబాటు కలవాళ్లు తమ తప్పులను ఎప్పుడూ ఒప్పుకోరు. సరికదా వాటిని ఆధారంచేసకుని ఇంకొంచెం కలతలు పెంచుతారు.

కొందరు అత్తలున్నారు గూ శా రూ? వాళ్ళు కనపడని కోడరికం పెడుతారు. చివరకు కొడుకుకూడా నమ్మేందుకు చాలా కాలం పడుతుంది. వాళ్ళుసూటిగా ఏమాటా చెప్పరు. అన్నీ డొంక తిరుగుడుగానే చెప్తారు.

ఉదయంపూట చాలాపనులు ఒక్కసారి చేసుకోవాలి. కాలకృత్యాలు తీర్చుకోవడం, కాఫీ ఫలహారాలు చేయడం, పని మనిషికి అంట్లూ చెంబులు వేయడం, ఒకటేమిటి అన్నీ ఒక్కమారువస్తాయి. 'అటువంటప్పుడు ఏపాలైనా కుంపటిమీదబెట్టి కాగుతున్నాయి కదా అని ఇంకోపనికి వెళ్ళిందనుకోండి. ఈపాలు కొస్తా పైముకనిబెట్టి పొంగుతాయి. అటువంటప్పుడు పొంగుతున్నదే పాలని దింపవచ్చుగా! దింపరు. కోడలువచ్చి దింపాల్సిందే. అంతటితో వూరుకోరు. ఎవరేనా ఇంటికివచ్చినప్పుడు నవ్వుతూ "ఏమండీ మాకోడలురోజూ పాలు పొంగబెడుతుంది అలా పాలు పొంగడం మంచిదా? చెడ్డదా" అని అడుగుతుంది. అక్కడితో ఈ కోడలు చాలా చిన్నబుచ్చుకుంటుంది, తను రోజూ పాలు పొంగపెడుతున్నట్లు అందరి ఎదుటా చెప్పాలా అని. కొంచెము అమాయకురాలైతే అప్పుడే అడుగుతుంది. దానితో అత్తగారూ నవ్వుతూ నేను నేరం చెప్పలేదమ్మా "మంచిదా? చెడ్డదా అని అడిగాను అంతే! అంటుంది" పోనీ భర్తతో అంటె "నువ్వురోజూ పాలు పొంగబెట్టటంలేదా అందుకే అంది మా అమ్మ" అని అంటాడేగానీ తల్లితో "దానికి ప్రొద్దున చాలా పనివుంటుంది నువ్వు దగ్గరుండి కాచుకోకూడదా" అని అనడు. తల్లీ కొడుకుల ఆపేక్షలు అటువంటివి.

ఇటువంటి సంసారాల్లో మొగవాళ్ళు ఏమాత్రం కలగజేసుకోకుండా వుంటే కొంతవరకు సంసారం బాగుపడుతుంది. కొడుకు తనకు ప్రోత్సాహం ఇవ్వకపోతే కొన్నాళ్లు కోడల్ని సాధించి వూరుకొంటుంది అత్త. ఇక కోడలు భర్త తనని అనకపోతే తప్పు తనదిగాదు అందుకే తల్లిని వెనకేసుకు రాలేదు అని కోడలు తృప్తిపడుతుంది. ఇలాగ కొన్నాళ్ళు గడిచేసరికి కలహాలు వాటంతటవేమాసిపోతాయి.

వెనకటి కొక మహానుభావుడు తనకూతుర్ని అత్తారింటికి పంపిస్తూ "అమ్మాయి! ఎన్నికష్టాలొచ్చినా మనసులో పెట్టుకుని, కడుపులో అగ్నిపర్వతాలు బద్దలవుతూన్నా ముఖాన్న చిరునవ్వు చిందించాలి" అన్నాడట. కొంచెందూరం ఆలోచిస్తే నిజంగా అదేనేమో పరిష్కారమార్గం!

బొమ్మకంటి అన్నపూర్ణ, లక్ష్మి,

## మాటజారితే

27-3-57 ఆంధ్ర పత్రికలో "ఇలాటివాళ్ళతో ఎలా?" అని టి. భాగేశ్వరీరాఘవరావుగారు వ్రాశారు. అది చదివింతరువాత నాకొక సంఘటన జ్ఞాపకంవస్తోంది. ఒకసారి మాయింటికి ఒక దగ్గిరబంధువు వచ్చింది. ఇంక ఆవిడనోరుకు ఒక హద్దుఅంటూ లేదు. ఆవిడ పనేమిటంటే వాళ్ళమీద చాడీలు వీళ్ళదగ్గిర, వీళ్ళమీద చాడీలు వాళ్ళదగ్గిర, వీళ్ళని వాళ్ళని ఏదో తప్పుపట్టి తిడుతూ వుండడమే పని. ఆవిడమాటలు వినేసరికి ఒక రోజులో తల తిరిగిపోయింది. పాపం వాళ్ళ యింటిలోవాళ్లు ఈవిడని రోజూ ఎలా భరిస్తున్నారా అనిపించింది. ఇదంతా ఎందుకు చెపుతున్నానంటే యీ అలవాటు చాలామందికి చూశాను. ఆడవాళ్ళేకాదు. ఇలాంటి మొగవాళ్ళూ వున్నారు. ఇలా చెబితే వాళ్ళలాభం ఏమిటో అర్థంకాదు! ఎవరి యింటిలోవాళ్ళు ఎంత సొద పెట్టుకున్నా కష్టంవుండదు. ఎవరింటికెళ్ళినా

తన ప్రతాపమంతా చూపించుకోడం ఏంబాగుంటుంది? అందుకే మన పెద్దలన్నారు "కాలు జారినా తీసుకోవచ్చు కానీ నోరుజారితే కష్టమని." ఈ సామెత ఆచరణలో పెట్టుకున్న వాళ్ళంతా తప్పక బాగుపడతారు. ఎదుటివాళ్ళతో మాట్లాడేటప్పుడు వాళ్ళమనసు కష్టపడకుండా, అనవసర ప్రసంగంమాని మాట్లాడితే బాగుంటుంది. వాళ్ళని సంతోషపరచినవాళ్ళమవుతాం, మనం సుఖపడుతాం.

ఆర్. టి. సుందరి, మద్రాసు.

## "అదిచదివిన మూడోరోజున"

పంజాబీల అతిథి మర్యాదల గురించి శ్రీమతి సుగుణ (హిస్సార్) వ్రాసినది చదివినప్పుడు, వారు గోరింతలు కొండంతలుగా వ్రాశారనుకొన్నాను. కాని నాది తప్పభిప్రాయమని తెలుసుకోడానికి రెండురోజులు కూడ పట్టలేదు. వారివ్యాసము నేను మంగళవారము చదివాను. గురువారము అసలుసంగతి నాకు తెలిసింది. ఏమిటంటే,

మా ప్రక్కింటికి పంజాబీలు క్రొత్తగా దిగారు. ఆమెకు హిందీ, పంజాబీ తప్ప ఇతరభాషలు తెలీవు. పిల్లలులేరు. ప్రొద్దు పోవడంలేదని మాయింటికొచ్చారు. నాకు హింది సరిగారాదు. అర్థముచేసుకోగలను. కొద్దిగా మాట్లాడగలను. అంతే! అలాగే మేము ½ గంటసేపు మాట్లాడాము. ఆమె వెళ్ళేటప్పుడు మరుసటిరోజు వారింటికి రమ్మని మరీమరీ చెప్పివెళ్లారు. అంతగా చెప్పినప్పుడు మనం వెళ్ళకపోతే బాగుండదని మరుసటిరోజు వెళ్లాను. నేనెళ్ళేటప్పటికి ఆమెభర్త యింట్లో నేవున్నారు. నన్ను చూసి చటుక్కున లోపలికి వెళ్లిపోయారు. ఆమె నన్నెంతో స్నేహపూర్వకంగా ఆహ్వానించి తీసుకెళ్లి మంచంమీద కూచోబెట్టారు. చాలాదూరప్రయాణమనీ (జబల్‌పూర్) అందువల్ల కుర్చీలు తెచ్చుకోలేదనీ సంజాయిషీ కూడా ఇచ్చారు. ఏమీ తీసుకోరాలేదని చెప్పారు. వాళ్లింట్లో గుడ్డల కుట్టుమిషను వుంది. మాగుడ్డలు టైలర్‌కు యిస్తున్నామని తెలుసుకొని 'మామిషనులో కుట్టుకోండి' అన్నారు. 'నాకు కత్తిరింపు సరిగా తెలీద'ని 'నేనుచెప్తే నేను నేర్పిస్తా'నన్నారు.

మేము ఆమాట ఈమాట మాట్లాడేటప్పటికి ఆమెభర్త బజారుకెళ్ళి కేకన్స్, పళ్ళు, మొదలయినవి తీసుకొని వచ్చారు. నేనెంతవద్దన్నా బలవంతంగా ఆమె నాచే అన్నీ తినిపించారు.

వాళ్ళింటికి వెళ్ళేముందు నాకు హింగి సరిగారాదు ఆమెతో ఎలాపొద్దుపుచ్చాలిరా బాబు అనుకొన్న నాకుగంటసేపుకూర్చున్నా ఓ 20 నిమిషాలే అయినట్టనిపించింది. వెళ్లానని లేచేటప్పటికి యింకాసేపు కూచోమని బలవంతముచేసి 15 నిమిషాలు కూచోబెట్టుకొన్నారు. రోజూరమ్మని మరీమరీచెప్పారు. నాకోసం రోజూ మీరు కష్టపడ్తేనే రానన్నాను. దానికి ఆమె ఇవాళే బాబుగారున్నారు. బజారువెళ్ళి తెచ్చారు. వారు లేకపోతే ఎవరుతెస్తారు అన్నారు నవ్వుతూ.

మాటల సందర్భంలో మా తెనుగు పుస్తకంలో మీ పంజాబీలు మంచివారని వ్రాశారు అని నేనుచెప్తే మేము సహజంగా పోట్లాడుకోము. మంచివారితోతప్ప పోట్లాడే వారితో మేము స్నేహము చేయమని ఆమె చెప్పారు.

మంగళా కందూర్ (విశాఖపట్టణం)

## ఇచ్చుట తెచ్చుటకొరకా?

27-3-57 తేదీ పత్రికలో అంత్యనిష్ఠురం కన్న ఆదినిష్ఠురమే మేలుఅని కోకా శ్యామల గారు రాసిన వ్యాసం చదివాను. ఆవ్యాసం పూర్తిగా సమర్థనీయంకాదు. తెల్లవారిలేస్తే ఇరుగుపొరుగులవారికి తొంబై అవసరాలు వస్తూఉంటయి. అవసరం అప్పుడు ఇరుగు-పొరుగు ఆదుకోకపోతేఎలా? అందుకని తెల్లవారిలేచినప్పటినుంచి అన్నీఅప్పులు తెచ్చుకోమనికాదు. ఎంతజాగ్రత్తగాఉన్నా ఎప్పుడన్నా ఏదన్నా మరిచిపోవటం తటస్థిస్తుంది. కుంపటిమీద నీళ్ళుపెట్టుకొని కాఫీపొడిలేదని గమనిస్తారు. అప్పుడు కాఫీ మానుకోవాలంటే ఎవరితరం. చటుక్కున పొరిగింటికిపోయి పొడుంతెచ్చుకుంటారు. కాని కాఫీమానెయ్యరుగదా. మనకుకూడా అవసరం వస్తుంది ఎప్పుడన్నా. ఇరుగు పొరుగులతో అవసరంలేకుండా ఎట్లా గడుస్తుంది.

ఒకరికి అప్పుఇవ్వం. మేము మరొకరి దగ్గర తెచ్చుకోం అని చాలామంది అంటూ ఉంటారు. ఇదికొంతమటుకు మంచిదే. కాని అనుభవంలో జరిగినసంగతి ఒకటి చెప్తాను.

మా పొరుగింటివారిపిల్లలు నేను పొద్దుగూకులు ఒకరిఇళ్ళకూ మరొకళ్ళం పోతూ ఉంటాం. వారికికూడా ఈఅప్పు ఇవ్వము, పుచ్చుకోము అనే నియమం ఉన్నదిట. ఒక రోజున వాళ్ల అమ్మాయి టైలరు జాకెట్లన్నీ అసహ్యంగాకుట్టాడు వాటినిబాగుచేయాలి నీకు చాతవునుకదా కాస్త బాగుచేసిఇస్తావా అని అడిగింది. సరేనన్నాను. ఆ వేళ మధ్యాహ్నం సూది, దారం, కత్తెర కావలసినవన్నీ తెచ్చుకున్నది. నేను జాకెట్లుబాగుచేసి ఇచ్చాను. మరునాడు నాకు కత్తెరతో అవసరంవచ్చింది. సమయానికి నాదగ్గర కత్తెరలేకపోయింది. నిన్న ఆ అమ్మాయి తెచ్చిందికదా వాళ్లకత్తెర ఒక్కసారి తెచ్చుకొని పనికాగానే ఇచ్చెద్దామని వాళ్ళఇంటికివెళ్లాను. మధ్యగదిలో ఉన్న మాస్నేహితురాలిదగ్గరకువెళ్లి ఒక్కసారి కత్తెర ఇవ్వవోయ్, మళ్లీ ఇప్పుడేఇచ్చేస్తాను అన్నాను. ఆ అమ్మాయి జవాబుచెప్పటానికి ఇంకా నోరుతెరవనేలేదు. ఇంతలో నేవాళ్లమ్మవంటింట్లోనుంచి ఆదరాబాదరుగా వచ్చి కత్తెర ఎక్కడ ఉన్నది విరిగిపోయింది అన్నది. ఆవిడమాట్లాడిన తీరుచూసి నేను తెల్లబోయాను. ఇదంతా ఇవ్వగూడదు, పుచ్చుకోకూడదు అన్న నియమం కాబోలు ననుకున్నాను. అయినా నేను మొండిగా ఆవిరిగినకత్తెరే ఇలాఇవ్వండి. నేను బాగు చేస్తాను అన్నాను. ఇంకా ఎక్కడున్నది. అప్పుడే పెంటపోగులో పారేశాంఅన్నది. ఆవిడమాటలలో ఎంతనిజంఉన్నదో నాకు అప్పుడేబోధపడ్డది. కాని మొండిగా అడిగి లేదనిపించుకున్నాను. ఇక నేను మాట్లాడకుండా ఇంటికి తిరిగివచ్చాను. మర్నాడే మాస్నేహితురాలి తండ్రివచ్చి గోతాలు, ఎడ్లచిక్కాలు తీసుకెళ్లాడు. ఆ తరువాత మాస్నేహితురాలేవచ్చి అప్పడాలకర్ర అడిగి తీసుకెళ్లింది. అంత నిర్మొహమాటంగా లేదని ఆవిడఅనగలిగింది కాని నేను లేదనలేకపోయాను. ఇలాగేఉంటయి తరహాలు. ఇవ్వనుపుచ్చుకోను అన్నప్పుడు రెండు మాటలు నిలబెట్టుకోవాలి. కాని నీదగ్గరికెవరన్నావచ్చినప్పుడు ఈమాట చెప్పి మరొన్నాడు నీవు ఒకరింటికి పోకూడదు. ఏమయినా నాఉద్దేశంలో ఈ నియమం ఏమంతమంచిదికాదు. చీరెలు, నగల విషయంలోమాత్రం నేనూ శ్యామలగారికి ఏకీభవిస్తాను. చీరెలు నగలు ఒకరిదగ్గరా ఏమయినాసరే ఎరువుపుచ్చుకోకూడదు. కాని ఇదికూడా చాలామంది ఎరువు పుచ్చుకునే వాళ్లు ఉన్నారు. అమ్మాయికి పెళ్ళివారు వస్తున్నారు. కాస్తపట్టుచీరె, గొలుసు, వడ్డాణం వగైరాలుఇస్తారూఅని సుతారంగా అడుగుతారు. పెళ్లిచూపులుకదాఅని లేదనలేక ఇస్తారు. ఆతరువాత ఆచీరె కాస్తా కాలకోవటమో లేక నగల్లోఏదన్నా రవాటు జరగటమో జరుగుతుంది. ఇకవారికీ వీరికీ తగాదా. ఎంగుకువచ్చిన అరువులు. ఈచీరెలు నగలు అరువుతీసుకోకుండా ఉండటం ఎంతైనా ఎందుకైనా మంచిది. ★

టి. నిర్మల (కసుకుర్రు)



# ఈ వేసవిలో



శీతాకాలం వెళ్ళి వేసవికాలం వచ్చింది. యీ కాలంలో ఉక్కకు శరీరమంతా పేలుతుంది. ఉక్కపోస్తుంది గదా అని అదే పనిగా చన్నీళ్ళస్నానం చేస్తారు కొందరు. కాని అలా చన్నీళ్ళ స్నానం చేసినందువలన ఆ కాసేపు హాయిగా వున్నప్పటికీ, శరీరమంతా మరింత పేలడమే కాకుండా వడదెబ్బకూడ తగలవచ్చు. ఎంత ఉక్కగా వున్నప్పటికీ కనీసం గోరువెచ్చని నీటితో ఉదయం సాయంత్రం స్నానంచేసిన, అంతగా పేలదు. వడదెబ్బకూడా తగలదు.

స్నానంచేసి చివరకు ఒకచెంబు నీళ్లలో కొద్దిగా పన్నీరు కలుపుకుని ఆ నీళ్లు వంటి మీద పోసుకుంటే ఆసువాసన శరీరమంతటా వ్యాపించి చెమటవాసన లేకుండా చేస్తుంది.

చెమటకు శరీరమంతా పేలి దురదలు పెడుతుంది. గోకేసరికి మంటలు లేస్తాయి. అలాంటప్పుడు స్నానం చెయ్యగానే శరీరానికంతకూ పవుడరు వేసుకొనిన ఆ మంటలు అంతగా వుండవు. పవుడరు యిపుడు అనేక రకములు వస్తున్నది. బోరిక్ టాల్కమ్ పవుడరయితే పేలడం తగ్గించవచ్చు. మరీ కున్నంమాదిరిగా మెత్తుకుంటే చెమటపట్టినపుడు చారికలు చారికలుగా పడుతుంది. ఈ కాలంలో బయటికి వెళ్లేటపుడు ముఖ్యంగా ముఖానికి పవుడరు రాసుకునేటప్పుడు జాగ్రత్తగా వుండాలి. ఈ మంటలకు మంచి గంధంకూడా రాసుకోవచ్చును. ఆ గంధంలో కొద్దిగా ఉడుకులోన్‌కూడా చేర్చి శరీరానికి పూసుకుంటే చల్లగావుండటమే కాకుండాశరీరమంతాసువాసనగావుంటుంది

వారమునకు రెండుసార్లయినా తలంటి పోసుకుని తరువాత సాంబ్రాణిపొగ తలకు వేసుకుంటే తలంతా వాసనవేస్తూ చెమట వాసనలేకుండా చేస్తుంది.

ఈ రోజుల్లో మల్లెపువ్వులు విరివిగా దొరుకుతవి. ప్రతిదినమూ కొంచమయినా సరే తలలో పెట్టుకుంటే తలంతా సువాసనలు వెదజల్లుతూ ఉంటవి. ముఖ్యముగా తలంటి పోసుకున్నపుడు ఈ మల్లెలు పెట్టుకుంటే మళ్లీ తలంటి పోసుకునేవరకు వాసన పోదు.

ఉదయంనుండీ మధ్యాహ్నంవరకూ గది తలుపులూ కిటికీలూ మూసివేసి మధ్యాహ్నమందు ఒక కిటికీ తెరుచుకుని ఆగదిలో కూర్చుంటే చల్లగావుంటూంది. ఉదయంనుండీ ఏ మాత్రము వేడిగాలి ఆ గదిలోనికి వెళ్లదుగాబట్టి ఆగది చల్లగా వుంటుందన్నమాట. ఉదయం పదిగంటలదగ్గర నుండీ సాయింత్రం నాలుగుగంటలవరకూ కిటికీలకు దరవాజాలకు వట్టివేళ్లతడికలుగాని లేనివారు గుప్పట్లుగాని, ఏదయినా బట్టగాని కట్టి నీటితో తడుపుతూ వుండాలి.

ఈ కాలం మందపాటి బట్టలు పనికిరావు. ముఖ్యంగా చిన్నపిల్లలకు అసలు పనికిరావు. వారికి సన్నటి గ్లాస్కో బట్టతో ఓపెన్ గౌనుగాని, షర్టులుగాని వదులుగా కుట్టించి అవి వెయ్యాలి. అంతేగాని ఉక్కగా వుందికదా అని బట్టలేకుండా వుంచకూడదు.

చెమటపట్టి పిల్లలు పూరికే ఏడుస్తుంటారు. ఏడుస్తున్నారుగదా అని ఎప్పుడు బడితే అప్పుడు స్నానం చేయించకూడదు. ఉదయం, సాయింత్రం ఎండ పూర్తిగా తగ్గిపోయిన తరువాత స్నానం చేయించాలి.

రోహిణీకార్తిలో ఎండలు విపరీతంగా వుంటవి. అలాంటప్పుడు దాహమధికముగా వుంటుంది. పెద్దలయితే కాచిన నీళ్ళు, కుండలోగాని, కూజాలోగాని పోసుకుని త్రాగుతారు. పసిపిల్లలకు దాహమయినా వారికి చెప్పడానికి మాటలురావు. అలాంటప్పుడు గంట, గంటకూ గ్లూకోజ్ నీళ్ళు ఇస్తూవుండాలి. కొంచెం పెద్దపిల్లలయితే ఎండు ఖర్జూరం చితుకగొట్టి నీళ్ళల్లో నానవేసి ఆ నీటిని త్రాగించవచ్చు.

కాఫీ టీ వంటి వేడి పానీయములకన్నా నిమ్మ, పైనాపిల్ మొదలయిన చల్లని పానీయములు త్రాగిన కడుపులో చల్లగా వుంటుంది. పైనాపిల్ టిన్స్ తెప్పించుకుని సాయింత్రం వాటిని సేవించిన చల్లగా హాయిగా వుంటుంది. అది కొనలేనివారు, వేడిచేసినపుడు సబ్జాగింజల నీళ్లు చక్కెరతో కలిపి త్రాగవచ్చును. పసిపిల్లలు, ఉక్కకు పేలి దురద మంటలవలన, ఏడుస్తారు. అలాంటప్పుడు కాలి బొటనవ్రేళ్ళకు, బొడ్డు చుట్టు నామ్ము నీళ్ళలో అరగదీసి రాసిన తగ్గిపోవచ్చును. పిల్లలకు తొడలదగ్గర చంకలలో ఎక్కువగా వరుస్తుంది. దానిని గమనించి పెద్దలు ప్రత్యేకంగా ఎక్కువసార్లు ఆ చోటులో పవుడరు అద్దాలి. పిల్లల పఫ్ మరెంకెవరూ వాడకూడదు. పఫ్ లేనియెడల శుభ్రమయిన బట్టతోనైనా అద్దాలి గాని చేతిలో మాత్రం పవుడరు రాయరాదు. మరీ ఎండగా వున్నప్పుడు పిల్లలకు విసరకూడదు. అంతగా ఏడ్చిన వట్టివేళ్ల విసనకర్రమీద నీళ్లుచల్లి బిడ్డ దగ్గరగా దానిని పట్టుకోవాలి. ఈ రెండు నెలలు మాత్రం ముఖ్యముగా పిల్లలను పెద్దలు అతి జాగ్రత్తగా చూచుకోవాలి.

—కొత్తపల్లి రాజ్యలక్ష్మి,
చిన్న గంజాం.




# సందేహాలు

"నవ్యశ్రీ"

చిట్టితండ్రి కెన్నెన్నో
తీరని సందేహాలు
చెప్పకపోయామా ఇక
పెట్టాడే రాగాలు.

అమ్మా నువు మా నాన్నని
'ఏమండీ' అంటుంటే
నాన్న నిన్ను 'ఏమె', 'ఓసె'
అని అంటా డెంచేతే?

పెద్దల మాటల వినమని
బుద్ధులు చెప్తావుగదా!
నాయనమ్మతో ఎప్పుడు
కయ్యమాడుతా వెందుకు?

ప్రక్కయింటి పిన్నిగారు
పంచదార అప్పడిగితె
ఉన్నా మన యింట్లో లే
దన్నావేం చెప్పమ్మా?

అమ్మమ్మను తిడితే నీ
కంత కోపమెందుకమ్మ?
మామ యొస్తాడంటే
మురిసిపడెద వెందుకమ్మ?

'అమ్మా! ఆకలి' అంటే
నైవేద్యం కాలేదని
అంటా వొకనాడైనా
దేవుడొచ్చి తినడేమే?

ఉదయం లేచింది మొదలు
వుపవాసా లంటుంటావ్
అరటిపండ్లు దిట్టంగా
ఆరగించడానికేన?

# పులితోలు

(గత సంచిక తరువాయి)

సీత: ఇప్పుడేనా? ఆనిక తిందాం.

ప్రసాద్: నాన్నే తినమన్నాడుగా. ఆనిక మామయ్య అరటి కాయలు తెస్తాడు. అవి తిందాం. సరేనా?

సీత: [అవునన్నట్లుతలూపుతుంది]

[ఇద్దరూ కూర్చుని బఠాణీలు తింటూవుంటారు. తెరలో పెద్దపులి లాగా గోండ్రు వినిపిస్తుంది. తింటూనే ఆలకిస్తారు. మరలా విని పిస్తుంది. పులి వచ్చేవైపుకు చూడ్డానికి భయపడి మరోవైపుకు తిరిగి కూర్చుంటారు.]

సీత: అన్నాయ్! నాకు భయంగా వుంది.

ప్రసాద్: [లోన భయపడుతూనే] పెద్దపులి కాదులేవే. మన సుబ్బడేమోను.

సీత: నువ్వుచూడు యెవరోను.

ప్రసాద్: ముందు నువ్వేచూడు.

సీత: నువ్వే చూడన్నయ్యా!

ప్రసాద్: అయితే ఇద్దరం ఒకే సారు చూద్దాం:

ప్రసాద్: అదుగో. ఒకటి, రెండు మూ......డు.

సీత: ఆఁ.

[తిరిగి చూచేసరికి పెద్దపులి నిలబడి వుంటుంది.]

సీత } ఆఁ...! ఆఁ...! ఆఁ
ప్రసాద్ } పు...పు...పు...లి, పె...పె...పెద్దపులి.

సీత: [భయంతో వణుకుతూ] నన్ను తినకు-అన్నాయ్! పులిగారికి నమస్కారం.

[ఇద్దరూ వంగి నమస్కరించి, చేతులు కట్టుకొని మోకాళ్ళమీద కూర్చుంటారు. పెద్దపులి గొప్ప తున్నట్లు 'గుఱ్ఱు'మంటూ నిలబడి వుంటుంది.]

ప్రసాద్: మీరు యెంతో గొప్ప వారనీ, ఇక్కడి అడవికి రాజుగారని

క వి రా వు

పాఠంలో మా మేష్టారు చెప్పారండి!

[పులిచర్మంక్రింద నున్నవారు ఒకరు నెమ్మదిగా గోండ్రించుతూ వుండాలి. సోముమాత్రం మాట్లాడాలి.]

పులి: నాకు ఆకలవుతుండీ. ముందు మిమ్మల్ని తినేస్తా.

సీత: [జాలిగా] మా సెనగలూ బఠాణీలూ ఇస్తా నన్నుతి నొద్దు.

పులి: నాకు బాగా ఆకలవుతూ వుంది. మీ యిద్దరినీ తినాలి. (పెద్దగా గాండ్రించును.)

[సీత మరీ భయంతో నేలమీద వంగి వణికిపోతూ వుంటుంది]

ప్రసాద్: [వణకుతూ] మే మేం చేశాం? నా చాకిలెట్లుకూడా మీకు ఇస్తాగా. ఇవి తిని మీ ఆకలి తీర్చుకోండ్.

[జేబులోవున్న చాక్లెట్లు, త్వర త్వరగా తీసి క్రింద పోస్తాడు. సీత కూడా బఠాణీలు క్రింద పోస్తుంది. కళ్ళుమాత్రం గట్టిగా మూసుకునే వుంటుంది.]

పులి: ఆ జేబులోని వేమిటి...?

సీత: [భయంతో] వ...వ...వప్పులు.

పులి: [కోపంతో] ఇందాకెందుకు చెప్పలా మరీ?

ప్రసాద్: మర్చిపోయానండి!

పులి: చూడు మిమ్మల్ని యేం చేస్తానో!

[పెద్దగా గాండ్రిస్తుంది. సీత, ప్రసాదు ఇంకా భయపడి నేలకు కరచుకొని వణికిపోతూంటారు: దూరంగా మనిషి మాట్లాడిన శబ్దం వినిపిస్తుంది. రాము పులి చర్మం పైకెత్తి చూస్తాడు.]

రాము: [గాభరాగా] సోము! సోము!! రంగయ్య వస్తున్నాడురోయ్.

[సోము, సుబ్బులూకూడా చూచి ముగ్గురూ పరుగెత్తుతారు. సీత, ప్రసాదు మాత్రం అలాగే నేలకు కరచుకొని వుంటారు. హడావిడిగా రంగయ్య ఒకవైపునుండి, మామయ్య మరో వైపునుండి 'పులి! పులి!!' అంటూ పరుగెత్తుకొస్తారు.]

రంగయ్య: [తొట్రుపాటుతో] అదృష్టవంతుణ్ణి! ఒక్క నిముసం ఆలస్యమైతే నా బిడ్డ లిద్దర్ని పులి పొట్టను పెట్టేవాణ్ణే.

మామయ్య: [తొట్రుపాటుతో] ఒంటిగా యెలా వదలిపెట్టి వెళ్ళావ్ బావా? ఇవాళ లేచినవేళ మంచిది. లేకపోతేనా...

రంగయ్య: సమయానికి ఇద్దరం రాబట్టి సరిపోయిందిగాని ఒక్క

క్కళ్లం అయితే మొత్తంగా తినే సేదే.

మామ: ఇంతకు ఇవ్వాళ ఎవరి ముఖం చూశామోగాని లేవగానే, అందరం అదృష్టవంతుల మయ్యాం బావా!

రంగయ్య: [పులి పోయినవేపు చూస్తూ] అదృష్టం అని చల్లగా అంటావేం?

ప్రసాద్: [పండుకొనేవుంటాడు] పులిరాజుగారూ! మా చాక్లెట్లు తిని మమ్మల్ని వదిలేయండి.

సీతి: మా మామయ్య మంచి మంచికాయలు తెస్తాడు. అవికూడా మీకే యిస్తాం.

రంగయ్య: [ఆశ్చర్యంతో] అరే! వీళ్ళింకా పులి వుందనుకొంటున్నారల్లేవుందే? (సీతిని లేవదీస్తుంటాడు)

మామ: అవును బావా! మనమే ఇంత హడలిపోతిమిగదా ఇక పిల్లల సంగతి చెప్పాలా?

రంగయ్య: [సీతిని లేవనెత్తుతూ] చిట్టీ ఇటు చూడమ్మా!

(సీతి భయంతో కళ్లు తెరవదు. వణుకుతుంది) నేను మీ నాన్ననమ్మా! పులి పోయింది.

(సీతి, ప్రసాదు భయంభయంగా కళ్ళు తెరుస్తారు)

సీతి: నాన్నా! (అని నాన్నను కౌగలించుకొని యేడుస్తుంది.)

ప్రసాద్: నాన్నా! (వచ్చి రంగయ్య చెయ్యి పట్టుకొంటాడు)

రంగయ్య: [సీతిని చూచి] జడుసుకొన్నారా? (ప్రసాదుతో) యేరా, నాన్నా? లేదులే (క్రింద



# పు లి తో లు



త్రొక్కి దుమ్ము దిగదుడిచివేసి 'పోయిందిలే' అంటాడు) ఇదుగో మీ మామయ్య వచ్చాడు. చూడండి!

మామ: రండమ్మా! రండి!

[సీతి రంగయ్యదగ్గరనుండి వాళ్ళ మామయ్య చేతిలోకి వస్తుంది. ప్రసాద్ కూడా దగ్గరకు వస్తాడు.]

ప్రసాద్: మాకేం తెచ్చావ్ మామయ్యా!

మామ: నీకు లాగులూ, చొక్కా...

సీతి. నాకూ?

మామ: నీకు గౌనూ తెచ్చా. పండక్కి మావూరు వెళదాం.

సీతి, ప్రసాద్: నేనూ వస్తా.

మామ: మీ రిద్దరూ, మీ అమ్మా...

సీతి: మా నాన్నో...?

మామ: మీనాన్న వద్దులే.

సీతి: ఆఁ! ఆఁ!!

మామ: సరే. మీ నాన్నను కూడా తీసుకపోదాంలే.

ప్రసాద్: నాన్న వస్తే, యింటి దగ్గరో?

[సీతిని రంగయ్య తీసుకొని ముద్దుపెట్టుకొంటాడు.]

రంగయ్య: పండగ? పెద్ద పండగ అయ్యేదే.

ప్రసాద్: చాక్లెట్లు అన్నీ ఇవ్వక పోతే మమ్మల్ని తినేసేదే పులి.

సీతి: [ఏడుపుముఖంతో] అన్నీ పులే తినేసింది నాన్నా!

రంగయ్య: [అటూ ఇటూ చూచి] ఇవిగో, అన్నీ యిక్కడే వున్నై. పులి చాకిలెట్లేమిచేసు కొంటుంది? రండి పోదాం.

ప్రసాద్: [పాఠం ధోరణిలో] పులి, మేకపిల్లను చంపి దాని మాంసమును తినును.

మామ: చాక్లెట్లు పోతేయేం? ఇవిగో నా దగ్గిర అరటికాయలూ. ఇంటికి పోయినతర్వాత, అందరకీ అమ్మ పెడుతుంది. (బయలుదేరు తారు)

సీతి: నాకొక అరటికాయ నాన్నా!

మామ: [ఒకటి తీసి] ఇదిగో!

ప్రసాద్: నాకుకూడా ఇయ్యవా మామయ్యా?

మామ: [మరొకటి తీసి] ఊఁ, ఇదిగో...

ప్రసాద్: ఇదికాదు. అదివ్వు (పెద్దకాయని చూపెడతాడు.)

మామ: (హేళనగా) పెద్దపులైతే ఈపాటికి పెద్ద పెద్ద కాయలు తెచ్చేది.

సీతి: దానికెక్కడివి మామయ్యా!

ప్రసాద్: ఇహిహిహి! ఈపాటికి మనసీతి పెద్దపులి పొట్టలో వుండేదే నాన్నా!

[అంటూవుండగా అంతానిష్క్రమిస్తారు: రెండవవైపునుండి సుబ్బులు, రాము, సోము ప్రవేశిస్తారు]

రాము: (ప్రక్కకు చూస్తూ) అదుగో! చాలదూరంపోయారులే!

సోము: క్రిందపోసిన బఠాణీలన్నీ మళ్ళీ తీసుకపోయార్రోయ్!

సుబ్బులు: (క్రింద మిగిలిన బఠాణీగింజలు యేరుకొంటుంది.)

రాము: రంగయ్య ఒక్కనిముసం రాకపోతే మొత్తం తినేవాళ్ళమేరా హాయిగా.

సుబ్బులు: అన్నాయ్! నాకు ఆకలవుతోంది.

సోము: ఉండూ. ముందు యివి ఏరుకొందాం.

[క్రిందపడిన బఠాణీలన్నీ ఏరు కొంటాడు]

రాము: నిజంగానే పులొచ్చి మనని తింటుందేమో ఇంటికిపోదాం రాండిరా!

సుబ్బులు: నాకు భయం వేస్తోం దన్నాయ్! ఇంటికిపోదాం రాండి.

సోము: నిజమేరా. రండిపోదాం.

[అంతా నిష్క్రమిస్తారు]

[తెర.]



# న్యాయం



అది అక్బరు పుత్రుడు జహంగీరు భారత దేశాన్ని పరిపాలిస్తున్న రోజులు. జహంగీరు కూడ తండ్రి గుణాలను చాలవరకు కలిగి ఉన్నాడు. తన రాజ్యంలో గొప్ప వారికి ఏవిధంగా అయితే న్యాయం జరుగుతుందో, బీదవారికి కూడ ఆ విధంగానే న్యాయం జరగాలని అతని కోరిక. ఆ విధంగానే న్యాయాన్ని చేకూరుస్తున్నాడు కూడ!

జహంగీరు చక్రవర్తిగా నున్న సమయంలో ప్రజలు సర్వసౌఖ్యాలు అనుభవిస్తూండేవారు. పొలాలు సస్యశ్యామలంగా పండుతూండేవి. ఎప్పుడూ ఆ రాజ్యంలో ఆనందం, సంతోషం, సౌఖ్యం నృత్యం చేస్తూండేవి. చాలామందికి కష్టాలంటే ఏమిటో కూడ తెలియదు.

చక్రవర్తి న్యాయం నాలుగు పాదాలమీద నడిచేటందుకుగాను కోట గుమ్మంవద్ద పెద్ద గంట కట్టి దానికి గొలుసు వేలాడేయించాడు. ఆ రాజ్యంలో ఎవరికైనా అపాయం గాని, అన్యాయం గాని జరిగితే వెళ్లి గొలుసు లాగి, గంట మ్రోగించేవారు. ఆ గంట మ్రోత రాజు వినిన వెంటనే, గంట మ్రోగించిన వ్యక్తిని తన ఆస్థానంలోకి పిలిపించేవాడు. అతని ఫిర్యాదును జాగ్రత్తగా విని, అతనికి అన్నివిధాల న్యాయం చేకూర్చేవాడు.

ఒక రోజు జహంగీరు ఆ గంట మ్రోత విని, ఆ వ్యక్తిని లోపల ప్రవేశపెట్టమని ఆజ్ఞ ఇచ్చాడు సేవకులకు. ఆ గంటకొట్టింది ఒక స్త్రీ.

ఆమె ఒక చాకలివాని భార్య. కోటనుండి ఒక బాణము వచ్చి ఆమె భర్తకు తగిలింది. వాడు బాణం తగిలిన వెంటనే ప్రాణం విడిచాడు.

"మహాప్రభూ! నా కష్టగాథ ఆలకించి నాకు న్యాయం చేకూర్చండి" అని వెక్కి వెక్కి ఏడుస్తూ పలికిందా స్త్రీ.

---

## "సత్యం"

---

"జరిగినదేదో చెప్పు" అడిగాడు చక్రవర్తి.

ఆమె జరిగినదంతా చెప్పింది ఏడుస్తూ.

"కోటలోనికి పోయి ఎవరైతే ఆ బాణాన్ని వేశారో, ఆ వ్యక్తిని వెంటనే తన ఎదుటకు తీసుకురమ్మనమని" ఆజ్ఞాపించాడు సేవకుని జహంగీరు వెంటనే.

అకస్మాత్తుగా రాణి నూర్జహాన్ తనంతట తానే భర్తఎదుటకువచ్చి ఈవిధంగా చెప్పసాగింది:

"మహారాజా, నేనే ఆ నీచ కార్యం చేసింది. నేను బాణాలు గురిపెట్టటం నేర్చుకుంటున్నాను. నాకొక పక్షి కనిపించింది. వెంటనే దానికి గురిపెట్టి బాణం విడిచాను. అకస్మాత్తుగా, దురదృష్టవశాత్తూ ఆమె భర్తకు తగిలింది, గురితప్పి ఆ బాణం. వెంటనే చనిపోయాడు ఆమె భర్త. ఒక మానవుని ప్రాణం నా చేతిమీదగా తీసినందుకుగాను ఎంతగానో దుఃఖిస్తున్నాను."

రాజు ఏవిధంగా తీర్పు ఇస్తాడో నని ఆదుర్దాగా చూస్తూ, రాణి చెప్పిన మాటలు విని నిర్విణ్ణులై, నిశ్శబ్దంగా ఎవరి స్థానాల్లో వారు కూర్చుని ఉన్నారు సభికులు.

జహంగీరు ఏమీ జవాబు చెప్ప లేదు. ఆయన చూపులు తీక్షణంగా ఉన్నాయి. వెంటనే వెళ్లి ఒక విల్లు కొన్ని బాణాలు తీసుకురమ్మనమని సేవకుని ఆజ్ఞాపించాడు.

సేవకుడు విల్లు బాణాలు తెచ్చి జహంగీరుకు అందిచ్చాడు. వెంటనే జహంగీరు వాటిని ఆ స్త్రీకి ఇస్తూ ఈవిధంగా చెప్పాడు:

"నా రాణి నీ భర్తను చంపి, నీకెంతో దుఃఖాన్ని కలిగించింది. ఆమె ఒక మహారాణి, నీవొక బీద దానవు. నీకు నీ భర్త అంటే ఎంత విలువో, ప్రేమో, ఇష్టమో, ఆమెకు ఆమె భర్త అంటే అంతే. "ప్రాణానికి ప్రాణమే!" ఇది నా నమ్మకము. నా ఈ సంపత్తి, శక్తులతో తిరిగి నీ భర్తను బ్రతికించ గలనా? నీవు ఇప్పుడు ఎంత దుఃఖిస్తున్నావో, అంత దుఃఖాన్ని ఆమె అనుభవించాలి! మానవుని జీవితపు విలువ తెలుసుకోవాలి. నన్ను చంపి నా రాణిని విధవగా చేయి!"

ఈ తీర్పుకు సభాసదులంతా ఆశ్చర్యచకితులైనారు. న్యాయం కోసం జీవితాన్నే వెచ్చించదలచిన చక్రవర్తినిచూచి "ఇటువంటి చక్ర

## ★ న్యాయం ★

వర్తిని ప్రపంచంలో ఎవరూ ఎక్కడ చూచి వుండరు!" అన్నారు.

కాని బీదవాళ్ల హృదయాల్లో గూడ దయ అంటూ వుంటుంది. ఆ బీదస్త్రీ రాణి ముఖాన్ని చూచి మరింత ఏడ్వసాగింది. ఆమె విల్లును బాణాలను చక్రవర్తికి తిరిగి ఇస్తూ ఈ విధంగా చెప్పింది:

"మీ న్యాయ దక్షతకు, ధర్మ బుద్ధికి నేనెంతో కృతజ్ఞురాలను. నేను మీ ప్రాణాన్ని గైకొన్నట్లైతే, మన దేశపు ప్రజలకందరికి అన్యాయం చేసినదాన్నవుతాను. మీలాంటి న్యాయమూర్తులను తిరిగి ఏ విధంగా సంపాదించుకోగలుగుతాము? చిర కాలం మీ రాణి ఐదవతనంతో జీవించాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను. నా భర్తను చంపింది నా "కర్మ" గాని, రాణి "విల్లు" గాదు!

ఆ బీదస్త్రీ చెప్పిన మాటలకు ఎంతో ఆనందం పొందాడు చక్రవర్తి. రాణి గుడ్డితనాన్ని క్షమించినందుకు ఎంత విలువైన ధనాన్ని యిచ్చినా ఆ స్త్రీకి ఇంకా బాకీయే పడివుంటుంది రాణి. తమ చక్రవర్తి జీవితపు విలువను గ్రహించిన ఆ స్త్రీని ఎంతగానో కొనియాడారు సభికులంతా. చక్రవర్తి ఆమెకెంతో ధనం ఇచ్చి గౌరవించాడు. ★

# సినిమా

## హాలీవుడ్ చోరీ చోరీ

సంగీత నాటక అకాడమీవారు ఈ మధ్య కళాకారులను సత్కరించిన సందర్భంలో, చలన చిత్ర కళాకారుల విషయమై ఒక ఢిల్లీ పత్రిక వ్యంగ్య ధోరణిలో వ్యాఖ్యానిస్తూ, హాలీవుడ్ చిత్రాలు ఆధారంగా తయారైన స్క్రీన్‌ప్లే కూడా ఒకటి ఏటేటా ఎన్నికచేసి, ఆ రచయితకూ నిర్మాతలకూ బహుమతి ఇవ్వాలని వ్రాసింది. ఈ సన్మానానికి అర్హులు బొంబాయి, మద్రాసీ నిర్మాతలు మాత్రమేనని పేర్కొంటూ, బెంగాలీ, మహారాష్ట్ర, తెలుగు చలన చిత్ర కారులకు మాత్రం ఉత్తమ స్వతంత్ర రచనపేరిట బహుమతులు ఇచ్చి గౌరవించవచ్చునని ఆ పత్రిక వ్రాసింది.



జమున

ఈ రెండు సూచనలూ కూడా అతిశయోక్తులు కావు.

ఈనాడు బొంబాయిలో ముఖ్యంగా హాలీవుడ్ చిత్రాన్ని కాపీకొట్టడం ఫాషన్ అయిపోయింది. గొప్పతనంగా చెలామణీ అవుతోంది. ఈ కార్యంలో ప్రవీణులైపోయి కొందరు బోర్డులు కట్టేదాకా వచ్చింది పరిస్థితి. కథాచౌర్యమే కాక, వాళ్లు కథ చెప్పినవిధం, భాష మాత్రం తేడాగా యథాతథంగా తీసుకొని చిత్రాలు నిర్మిస్తున్నారు. పాటలు సరేసరి. హిట్ అయిన హిందీపాటల గుట్టుమట్లు అన్నీ రేడియోలో వచ్చే అమెరికన్, స్పానిష్, రికార్డులు రట్టు చేస్తునేఉన్నాయి.

ఈ పరిస్థితి బాధాకరం; ప్రమాదకరం కూడా. ఏడాదిక్రితం ఈ దేశంవచ్చిన పారమౌంట్ చిత్రం "నాక్ ఆన్ వుడ్" (డానీ కేయీ నటించినది) బొంబాయిలో "బేసరా" పేరిట వేరే తయారైపోయి ప్రదర్శించబడుతోంది. "యు కాంట్ రన్ అవే ఫ్రం ఇట్" అనే మరో చిత్రం హిందీలో హిట్ అయిన "చోరీ చోరీ"గా తర్జుమా అయి ఊరుకుంది. ఇలాగే పరాయి దేశంనించి మంచి చిత్రం రావడంతడవుగా, దానికి ప్రతిరూపం తయారవడం పరిపాటి అయిపోతోంది. దీనికి రచయితలు బాధ్యులు కారు. నిర్మాతలూ బాక్సాఫీస్ అథారిటీలూను.

ఒకపక్క వీరిలా చేస్తూనే మన చిత్రాలకు ప్రతిరూపాలు తీస్తున్న పాకిస్తాన్ నిర్మాతలను గట్టిగా కోప్పడడం ఆశ్చర్యకరం.

ఆశ్చర్యపడడం, అనక ఊరుకోవడం అయితే ఫరవాలేదు గాని, ఈ చిత్రచౌర్యం మితిమీరిపోతే ప్రమాదకరం. ఇప్పుడు దాదాపు అంతపనీ అయింది. పారమౌంట్ పిక్చర్స్‌వారు తమ చిత్రం "నాక్ ఆన్ వుడ్"ను అనుకరిస్తూ బొంబాయిలో ఒక నిర్మాత 'బేసరా' అనే చిత్రాన్ని తయారు చేశాడనీ అందువల్ల వెంటనే ఆ చిత్రం ప్రదర్శన ఆపించాలనీ న్యాయస్థానంలో 'ఓ ముక్క తగిలించారు.'

ఈ కోవకు చెందిన మరో హిందీచిత్రం ఉంది. ఒక హాలీవుడ్ చిత్రానికి ముక్కకి ముక్క కాపీ అయినా ఆ చిత్రాన్ని ఆసియా చలన చిత్రోత్సవంలో దేశదేశాల ప్రతినిధులకు చూపించబోతున్నారట.

ఇలాంటిదే ఇంకో వార్త: మన చిత్రాలలో పాటల రికార్డులను అమెరికాలో విడుదల చేస్తున్నారట. వాళ్ల పాటలే వాళ్లకి వినిపించే పరిస్థితి ఏర్పడకుండా, కాస్తంత శ్రద్ధ తీసుకుని, దేశీయమైన చిత్రాలలోని భారతీయమైన సంగీతాన్నే ఆ దేశీయులకు వినిపించడానికి తగిన కట్టుదిట్టాలు జరగడం వాంఛనీయం. ★

## నటకావతంసకు ఘనసన్మానం

# “స్థానం” ప్రతిభకు జోహార్లు

“చేప సొగసుగా ఈదడంలో గొప్పేముంది?” అన్నారు నటకావతంస స్థానం నరసింహారావుగారు.

“ఆడువారికి ఆడుతనం నేర్పగలిగిన”



“నటనకు వార్థక్యం లేదు.”

నటుడు నరసింహారావుగారిని, తెలుగు చలనచిత్రకళాకారులు, మద్రాసు ఆంధ్రుల తరఫున ఏప్రిల్ 6న దక్షిణభారత హిందీ ప్రచార సభలో సన్మానించారు. ఆయనపై పుష్పాలూ, ప్రశంసలూ, జోహారులూ కురిపించి పూజించారు. దక్షిణభారత హిందీ ప్రచారసభ ఆవరణ ఆ రోజున కిటకిటలాడిపోయింది.

సభకు మద్రాసు ప్రధాన న్యాయమూర్తి పి. వి. రాజమన్నారు అధ్యక్షత వహించారు.

ప్రతిభకు తగిన ఠీవితో, ఘనతకు తగిన వినమ్రతతో పద్మశ్రీ స్థానం, సన్మానానికి సమాధానం చెప్పారు.

“చేప చక్కగా ఈదితే గొప్పేముంది? దానికి మెప్పేమిటీ — 35 ఏళ్ళు రంగస్థలం మీద అనుభవం గడించిన నేనుగాక ఇంకెవరు గొప్పగా నటిస్తారు ... అసలు నాకు తప్పుచెయ్యడానికి అధికారం లేదు...అయినా నాటికీ నేటికీ నేను నా కళలో పరిణతికై నిరంతరము కృషి చేస్తూనే ఉన్నాను. ఈ తపస్సు ఎప్పుడూ సాగేదే...”

వేద పఠనంతో సభ ప్రారంభమైంది. పిల్లలు, నరసింహారావుకు పూజ చేశారు. సన్మాన సంఘాధ్యక్షుడు బి. ఎన్. రెడ్డి స్వాగతం చెప్పారు. ఇంటూరి వెంకటేశ్వరరావు సన్మానపత్రం సమర్పించారు. సభాధ్యక్షులు రాజమన్నార్ నరసింహారావుగారికి స్వర్ణకంకణం తొడిగి సన్మానించారు.

“...అన్నిటికన్న నాకు ‘మధురవాణి’ అంటే ఇష్టం. కళాతపస్వి స్థానంవారికి బహుమతి అనేదికనక ఇచ్చేటట్లయితే నామటుకు నేను, ఆ పాత్రను నటించినందుకే ఆయనకు ఆ బహుమతి నిస్తాను...” అన్నారు రాజమన్నారుగారు. ఈ ‘నాటకచక్రవర్తి’ అనుభవాన్ని, పరిపక్వమైన ఆ నటనా కౌశలాన్ని మనం సద్వినియోగం చేసుకోవాలంటే ఆయనకు నిజమైన సన్మానం చేయాలంటే ఒక నాటక పాఠశాల నెలకొల్పి ఆయనను నాట్యాచార్యులుగా చేయాలని రాజమన్నారుగారు సూచించారు.

“నా మిత్రుడంత గొప్ప నటుడు ఇంకెక్కడా ఉండబోడు” అన్నారు దేవులపల్లి కృష్ణశాస్త్రి. “సంయమం ఈయన నటనకు ప్రధాన లక్షణం. కీట్సు సానెట్‌లా, కాళిదాసు పద్యంలా, ఈయన ఒక చిన్న హావంలో గొప్ప భావాన్ని చెప్పగలరు...” అన్నారు. మోటూరి సత్యనారాయణ మాటలాడుతూ స్త్రీ వేషము వేసి కీర్తి గడించుకొనినవారు భారత దేశము మొత్తముమీద స్థానం నరసింహారావుగారే అన్నారు. నాగయ్య ప్రసంగిస్తూ స్థానంవంటి నటుల శిల్పాన్ని వివరిస్తూ గ్రంథాలు వ్రాయాలన్నారు. నార్ల వెంకటేశ్వరరావు మాట్లాడుతూ మనకు మంచి నటులున్నారుగాని నాటకాలు లేవన్నారు.

---

విశాఖజిల్లా మాడుగుల గ్రామంలో ఒకరోజు రాత్రి ‘తులాభారం’ నాటక ప్రదర్శన ఏర్పాటు అయింది. నాటకశాల ఏమంత అఖండంగా లేదు. అందుకని సత్యభామ వేషధారి(ణి), ముస్తాబు దగ్గరలో ఉన్న ఒక ఇంట్లో చేసుకోవడానికి ఏర్పాటు అయింది. ముస్తాబై బయలుదేరే వేళకి, ఆయింటివారిని పిలవడానికి ఎవరో వచ్చారు. ఆ వచ్చినామె 40 ఏళ్ళ ఇల్లాలు. ఆవిడ, చటుక్కున సత్యభామ దగ్గరకొచ్చి బొట్టుపెట్టింది. సత్యభామ తుళ్ళిపడింది.

“అమ్మడూ ఈ వడ్డాణం ఎంతైంది బావుందిస్మీ” అని కబుర్లు కూడా మొదలుపెట్టింది ఆవిడ! అంతట్లోకి ఆ యింటి ఇల్లాలు అది గమనించి “అయ్యో పిన్నీ! ఆయన్ని అమ్మడూ అంటావేమిటి మతిగినా పోయిందా” అంది విస్తుబోతూ.

ఆ “ఆవిడ” వేషంలో ఉన్న ‘ఆయన’ పేరు స్థానం నరసింహారావుగారు.

ఈ సంఘటన జరిగింది 20 ఏళ్ళనాడు.



సభాధ్యక్షులు శ్రీ రాజమన్నార్ స్థానంవారికి వెండి అశోకస్తంభాన్ని బహూకరిస్తున్నారు. వారి ప్రక్కన ఉన్నవారు శ్రీ బి. ఎన్. రెడ్డి.

తరువాత ఆహ్వానసంఘ కార్యదర్శి ముదిగొండ లింగమూర్తి, సన్మానానికి విరాళాలిచ్చిన చలనచిత్ర కళాకారుల పేర్లు చెప్పారు. సభకు దాడి గోవిందరాజులు నాయుడు, డి. వి. సుబ్బారావు, బసవరాజు సుబ్బారావు, జోగినాథం, పైడిపాటి సుబ్బరామశాస్త్రి ప్రభృతులు పంపిన సందేశాలను చదివారు.

ఎం. ఆదిలక్ష్మి, రావూరి సత్యనారాయణ స్థానంవారి ప్రతిభను ప్రశంసిస్తూ పద్యాలు వ్రాసి సమర్పించారు.

తరువాత తెలుగు చలనచిత్ర నటీనటులు, శ్రీ రాజరాజేశ్వరీ ఫిలింకంపెనీ, కల్యాణీ ప్రొడక్షన్స్, మద్రాసు ఆంధ్ర విద్యార్థులు, మద్రాసు ఆంధ్ర విద్యార్థినులు, మద్రాస్ టెక్నాలజీ ఇన్‌స్టిట్యూట్, జార్జిటౌన్ ఆంధ్రులు, లిటిల్ థియేటర్స్, జి. సి. ఐ. ఎం. కళాశాలలవారు పుష్పహారాలు వేసి గౌరవించారు.

అనంతరం స్థానం నరసింహారావుగారు 'నవ్విస్తూ కవ్విస్తూ' సన్మానానికి సమాధానం చెప్పారు...

35 ఏళ్లనాడు ఒక కిరాయి హరిశ్చంద్రుడి నాటకంలో ఒక చంద్రమతి గైరుహాజరయ్యాడు. ఆపద్ధర్మంగా ఆ రోజున స్థానంవారు చంద్రమతివేషం కట్టారు. అంతా బాగుందన్నారు.

"ఎందుకు అన్న ప్రశ్నకు జవాబు అప్పుడు తెలియలేదు; కాని, ఇన్నాళ్లు రంగస్థలం మీద ఉన్నాక ఈనాడు తెలిసింది. ఇపుడు నన్నెందుకు మెచ్చుకుంటారో, ఎందుకు మెచ్చు కోవాలో నాకు ముందే తెలుస్తుంది. అలా తెలుసుకుంటునే నేను నటిస్తాను. నటుడు పాత్రలో లీనమైపోవాలనీ, మంచినటుడు అలా తన్మయుడు అయిపోతాడనీ కొందరంటారు. నేను అనను. అనుకోను. రంగం మీద నేను నటించే పాత్ర పక్కన నించుని మంచీ చెడ్డా చెప్పి నడిపిస్తూ ఉంటాను.

నెల్లూరు కస్తూరిదేవి విద్యాలయ సహాయార్థం బెంగుళూరులో "తులాభారం" నాటకం ప్రదర్శనజరిగింది ఒకసారి. ముందువరసలో కూర్చున్న ఒక రిటైర్డు ఆఫీసరూ, ఆయన భార్యా నాటకం బావుందంటే బావుందనుకున్నారు. ఆ సంగతి తమకునచ్చిన నటీమణికి చెబితే మరీ బావుంటుందనికూడా అనుకున్నారు. ఇలా కూడబలుక్కుని, ఓ పూలదండ కొనుక్కుని స్టేజివెనక ముస్తాబుల గదిలోకి వెళ్ళి తమ అభిమాన నటీమణిని పలకరించి, అభినందించి, పూలమాల వేయదలచుకొన్నామన్నారు. ఆ నటీమణి మహాద్భాగ్యం అని తల వంచింది. ఆఫీసరుగారు దండ వేసినంత పనిచేసి, అంతలోకే భార్యవంక చూసి ఆ ప్రయత్నం మానుకున్నాడు. ధర్మపత్ని పక్కన ఉండగా అన్యకాంత మెడలో దండవెయ్యడం బాగుండదనుకుని, అని, ఆ దండని భార్యచేతికి ఇచ్చాడు. ఆమె సరేనని ఆ దండ వేయబోయి అట్టే ఆగిపోయింది ఈ సత్యభామ నిజంగా భామ అవునా కాదా అని అనుమానం కలిగి.

ఆ భామ వేషంలో ఉన్న స్థానం నరసింహారావు కిలకిలనవ్వి, "నేను సగం ఇటూ, సగం అటూ లెండి. అందుకని ఇద్దరూ కలసి దండ వేయండి" అన్నారు. ★

## నేనూ, కామినీ

"నా స్త్రీ వేషం నన్నెన్నడో వరించింది. పత్నీభావాన ప్రేమించింది. సేవాధర్మాన సేవించింది. మమకారాన మాటలు నేర్పింది.........నాటకరంగ విహారాన నన్నామె తనలో దాచేసుకొని రోషనారగా, సత్యభామగా, చిత్రాంగిగా, చింతామణిగా అనేక నామరూపాలతో మారుతూ ఆడుతూ పాడుతూ ఉంటుంది. నాటకం రోజు రాత్రి తప్ప విడిగా నన్నావహించదు. మంచి ఆలోచన గలది........

మా సరసాలు చిత్రంగా ఉంటాయి. "ఇదిగో చూడూ నాకు ఇన్నేళ్లొచ్చాయిగదా. తలకూడా నెరసింది.........ఇంకా నామీద మోజు తగ్గలేదా?" అంటాను నేను.

"తగ్గడమేమిటి. చెట్లకు చావనలుపూ, మనిషికి చావతెలుపూను. ఆనందానికి హద్దుందా" అని మధురవాణిలా నవ్వుతూ మూతి మూడొంకరలు తిప్పుకొంటుంది కామిని.

"ఇన్నేళ్లొచ్చాయి సిగ్గులేదా నీకు" అని నేనంటే "సిగ్గేమిటి నాకు నీవద్ద చంద్రమతినయ్యాను, లీలావతినయ్యాను, మురనయ్యాను, సుభద్రనయ్యాను ఇంకా ఎందర్నో అవుతాను. బిడ్డలతల్లికి నాకు నీవద్ద సిగ్గేమిటి పోదూ" అని మరింతగా మురుసుకొని నన్నొరుసుకొంటుంది.

ఇది ఎన్ని జన్మల సంస్కార బాంధవ్యమో నాకు జ్ఞాపకం లేదుగాని ముందుజన్మల్లోకూడా నన్నే తానావహించి ఉంటానని స్ఫురింపచేస్తూ ఉంటుంది."

(స్థానం.)

## నటికావతంస

రంగస్థలంమీద ఆ పాత్రకు ఏం చెప్పాలన్నది ముందు నేర్చుకుంటాను. దారివెంట వెళ్లే స్త్రీల వెంటపడి వాళ్లు ఎలా నడుస్తున్నారు. వాళ్ళకి సహజంఅయిన ఆ వయ్యారం హొయలు ఎలాటివి; ఎంతవరకు నవ్వితే, ఎదటివాడికి ఏం అనిపిస్తోంది-ఇలాటివన్నీ శ్రద్ధగాపరిశీలిస్తాను. ఇంటికెళ్లి నిలువుటద్దం ముందు నిలబడి నాకు నేను నేర్పుకుంటాను. నిజానికి దొకటేకాదు. నీ వేషం రాణించాలంటే తోటినటుడికి, నిన్ను ఎలా నవ్వించాలో, ఎలా కవ్వించాలో తెలియాలికదా. సేవకుడు దండంపెట్టేపద్ధతివల్ల రాజుగారికీవి ప్రస్ఫుటం అవుతుంది. ఏదేనాఅంతే. అందువల్ల స్త్రీలు ఏంచేస్తారన్న పరిశీలనతోపాటు, పురుష పాత్ర హావభావాలు ఎలా ఉండాలి అన్నది కూడా సమగ్రంగా తెలుసుకోవాలి. ఏనటునికైనా అంతే. తన పాత్రని నిర్దుష్టంగా పోషించడానికి, పదివిధాల సాధన చేయాలి...నాటకానికి మహత్తరమైన శక్తి ఉంది. నటన గొప్పకళ. ఇందులో పరిణతికై నేను చేసేకృషి నిరంతరమైన తపస్సు. ఇది ఒక్కొ అది ఒక్కొ, వీడుమనిషి అనే భేదాలకు అతీతమైన దృష్టి అలవరచుకోవడానికి నాలో నేను నిరంతరం తపన చెందుతాను. పరిపక్వత సాధించాను అవటంలేదు, కాని ఏనాటికైనా సాధిస్తానని నమ్మకం. నేను ఇన్నాళ్లుచేసిన కృషికి నేడింత సన్మానం జరుగుతోంది, నేను మరింతకృషిచేసి ఉంటే, ఇంకెంతటి స్థాయిని సాధించేవాడినో అనిపిస్తుంది. నేను నాటికి నేటికి విద్యార్థినేం. స్త్రీలోకం నా గురుపీఠం. నటనకు వార్థక్యం లేదు; రాదు...

యువకులను సమర్థులైన నటులుగా తీర్చిదిద్దడంలో ఆచార్యత్వం కాకపోయినా, నేనూ ఒక విద్యార్థిగానే పాల్గొని నాటకరంగానికి సేవచేయాలని ఉంది..."

* * *

సభ అనంతరం, "పెళ్ళిచూపులు" అనే నాటకాన్ని (రచయిత శ్రీ ముదిగొండ లింగమూర్తి) ప్రదర్శించారు. కె. వెంకటేశ్వరరావు, రావి కొండలరావు, శివరామరెడ్డి, కె. ప్రసాద్, కె. వి. రమణారావు, నారాయణరావు, ఎం. నాగేశ్వరరావు ఇందులో పాల్గొన్నారు. వీరందరికీ స్థానం వారు రజతపాత్రలు బహూకరించారు.

ఈ నాటకం ఆంధ్ర వారపత్రికలో ఇటీవల ప్రచురితం అయి పాఠకుల అభిమానాన్ని విశేషంగా చూరగొంది. 



సమ్మానితులకు వేదోక్తగా స్వాగతం ఇచ్చారు. శ్రీయుతులు లింగమూర్తి, నాగయ్య, బి. ఎన్. రెడ్డి, డా॥ కె. వి. స్వామి, నరసింహారావు, కడారు నాగభూషణం, రాజమన్నారు, ఉన్నవరావు గోపాలకృష్ణయ్య.

# ప్లేబాక్ గాయకుడు పి. బి. శ్రీనివాస్

సాయంత్రం 6-55 కి రివ్వున పరిగెత్తుకొచ్చేవాడు ఓకుర్రాడు. మూడేమ్మూడు నిముషాలుసేపు ఆసినిమా గేటుకి కొంచెం దగ్గిరగా నిలబడి మళ్ళీ తుర్రున ఎగిరిపోయేవాడు. మళ్ళీ 7-23 నుంచి 7-26 వరకూ అలా కళ్ళుమూసుకు నిలబడి రివ్వున వెళ్ళిపోయేవాడు.

8-40 కి సినిమా గేటు ఆసామిని పక్క గేటు అతనుపిలిచి "ఇపుడు మళ్ళీ వస్తాడు కదూ ఆ కుర్రాడు" అన్నాడు.

"రాడులే ఈపాట బావుండదు. అతనికి నచ్చలేదు. అందుకే నిన్న రాలేదు" అన్నాడు మొదటి ఆసామి.

ఆ కుర్రాడు రోజూ అంతే. కొత్తసినిమా రాగానే తొలిరోజున టికెట్ కొని వెళ్ళి చూసేసేవాడు. అందులో అతనికి నచ్చిన పాటలు రెండో మూడో ఉంటాయి.

మర్నాడు, ఆపాటలు సరిగ్గా ఎన్ని గంటల ఎన్ని నిమిషాలకి వస్తాయో గుర్తుపెట్టుకునేవాడు. మూడో రోజు నించి, సరిగ్గా ఆ నిముషానికి ఇంటిదగ్గర్నించి పరుగెత్తుకువచ్చి గేటుదగ్గిర నిలబడి ఆపాటవిని వెళ్లిపోయేవాడు. మళ్లీ రెండోపాట (అతనికి నచ్చినది) మొదలయే వేళకి మళ్ళీవచ్చి మూడునిమిషాలూ వినేసి, ఇంటికెళ్ళిపోయేవాడు.

ఇలా బాల్యంలో ఏకలవ్య శిష్యరికం నెరపిన నేటి ప్లేబాక్ గాయకుడిపేరు పి. బి. శ్రీనివాస్.

కళాకారుడుగా పేరుతెచ్చుకుని వృద్ధిలోకి రావలసిన ప్రతివ్యక్తీ పువ్వులాగా పుట్టగానే పరిమళించడం, రెండు రెండు రెళ్ళు నాలుగన్నంత ఖరారు. అలాగే, కళారాధకుల కథలన్నింటా అంత ఖరారుగానూ కనబడే మరోఘట్టం, ప్రతిబంధకాలను ఎదుర్కోవడం. లైలామజ్నూ ప్రేమించుకుంటే, వాళ్ళ నాన్నలూ, మావయ్యలూ, సంఘం తాలూకు దళసరి గోడలూ అడ్డు నిలబడడం మామూలు. లలిత కళాభిరుచికల చిన్నవాడుగాని చిన్నదిగాని అవి నేర్చుకుని ఆరంగంలో కృషి చేయాలని ఉబలాడ పడ్డపుడు తాలూకాఫీసు గుమాస్తా గిరీ చెయ్యక తప్పదని బలవంతపెడతారు పెద్దవాళ్లు.

ఉద్యోగం లేకున్నా అదే పోయెగాని ఆ సినిమాలవెంట, నాటకాలవెంట తిరగడానికి వల్లకాదని శాసిస్తారు. నటుల వర్తకుల జీవిత కథలలో ఈ ఘట్టం మామూలే.

పి. బి. శ్రీనివాస్, గాయకుడుగా చలన చిత్ర పరిశ్రమలో చేరదలచుకొన్నప్పుడు వాళ్ళ నాన్నగారు, ఫణీంద్రస్వామిగారు కఠినంగా శాసించలేదు కాని, మంచిచెడ్డలూ సాధక బాధకాలూ ఆలోచించుకోవలసిందని గట్టిగా తెలియ చెప్పారు. ఈ లోగా 'లా' చదవమన్నారు.

శ్రీనివాస్‌కి తన లక్ష్యం సిద్ధిస్తుందన్న గట్టి నమ్మకం, సాధించాలన్న పట్టుదలా ఉన్నా తండ్రిని ఎదిరించ మనస్కరించలేదు. ఆయన చెప్పినట్టు న్యాయశాస్త్రం చదువుతూ ఆలో



చించవచ్చునని తోచింది. ఈ రెండు పనులతోపాటు కాస్త ప్రయత్నాలు కూడా సాగించడానికి విశాఖపట్టణంకన్న చెన్నపట్నంలో ఎక్కువ వీలుంటుందనికూడా తోచింది. ఫిలిం స్టుడియోలు అక్కడే ఉంటాయి మరి. అందుకని మద్రాసు న్యాయ కళాశాలలో చేరాడు శ్రీనివాస్ తన ఊహలు మటుకు తనలోనే దాచుకుని.

"అప్పటి కది "ఏక్ హీ రాస్తా" అనిపించింది." అంటాడు శ్రీనివాస్ ఇపుడా విషయం చెప్పి నవ్వుతూ.

శ్రీనివాస్‌కి హిందీ బాగావచ్చు. విశారద పట్టం పుచ్చుకున్నాడు ఆ భాషలో. ఇక, అరవం, ఉర్దూకూడా తెలుగంతధారాళంగా వాడగలడు.

"సంస్కృతంలో కూడా కొంచెం జ్ఞానం ఉందని చెప్పుకోవడానికి సంతోషిస్తున్నాను" అంటాడు శ్రీనివాస్. ఇంటర్మీడియెట్ దాకా సంస్కృతం "సెకండ్ లాంగ్వేజ్" గా అభ్యసించాడు.

సంగీతం తరవాత అతనికి అత్యంత ప్రియమైనది వివిధ భాషలు నేర్చుకోవడం.

ఈరోజున ఆ "చిన్ననాటి సరదాలు" అతని వృత్తి పది విధాల రాణించడానికి ఉపయోగించాయి. తెలుగుతోపాటు తమిళ, మలయాళ, హిందీ భాషా చిత్రాలలో కూడా శ్రీనివాస్ పాటలు పాడాడు. చక్కని కంఠస్వరంతోపాటు, పాడే పాటలో భాష ఉచ్చారణ కూడా చక్కగా నేర్చుకుని ఉండడం గాయకుడికి ఒక ముఖ్యమైన అర్హత.

* * *

లా కాలేజిలో చదువుతున్న రోజుల్లో శ్రీనివాస్ అంతర్ కళాశాల సంగీత పోటీలో ప్రథమ బహుమతి నందుకున్నాడు. అచిరకాలంలోనే చలన చిత్ర సీమలో ప్రవేశానికి ఆహ్వానం అందుకున్నాడు. జెమినీ స్టుడియోలో సంగీత దర్శకుడు శ్రీ ఈమని శంకరశాస్త్రి శ్రీనివాస్‌కు తొలిసారిగా ఈ అవకాశం కల్పించారు. జెమినీ వారి "అవ్వయ్యార్" "రాజీనా ప్రాణం" "బహుద్ దినహుయే" "మిస్టర్ సంపత్" చిత్రాలలో శ్రీనివాస్ పాడాడు. "నాగుల చవితి"లో శ్రీనివాస్ పాడిన "సాగర మీదుట నీదరి జేరుట" అనేపాట బహుళ జనాదరణ పొందింది.

తరువాత పది పదిహేను తమిళ చిత్రాలలోనూ పది తెలుగు చిత్రాలలోనూ శ్రీనివాస్ పాడాడు. ఐతే వీటిలో ఒక విశేషం ఉంది. అది నేటి చలన చిత్ర పరిశ్రమలోని అన్ని రంగాలలోను పరిపాటే. ఒక నటిగాని నటుడుగాని ఒక వేషం గొప్పగా ఒప్పిస్తే తరువాత వచ్చే అవకాశాలన్నీ అక్షరాలా అలాటివే అయి ఉంటాయి. ఒక దర్శకుడు ఒక రకం చిత్రం బాగా తీసినా ఒక నర్తకి ఫలానా పద్ధతి నృత్యం అద్భుతంగా చేసినా వారి ప్రతిభ అంతా ఎప్పుడూ 'డిటో డిటో' పనులకే అంకితం అయిపోతుంది. శ్రీనివాస్ కొంతకాలం క్రితం ఒక తరహా పాటను హుషారుగాపాడి భేష్ అనిపించుకున్నాడు దరిమిలా అతడు పాడిన పాటలు నూటికి తొంభైవరకూ అదే ఫక్కీలో ఉన్నాయి.

మిగతా పదింటిలోను మణిపూసల్లాంటి పాటలున్నాయి. సాహిణి వారి తొలి చిత్రం 'అమర సందేశం'లో "దయామయీ శారదా' అనే పాట శ్రీనివాస్ కంఠంలో మాధుర్యానికొక నిదర్శనం. అలాగే ఇటీవల" సెల్వకోటీ వారు నిర్మించిన "స్వయంప్రభ" లో "ఆనంద మధురమీ వేళ" అన్న పాట అతని ప్రతిభను ప్రతిబింబిస్తోంది. ఈ పాటను ఇంత మధురంగా పాడగలిగిన గాయకుడి కంఠం, ఎక్కువగా మరోకరకం పాటలకే వినియోగించడం జరుగుతోందేం అనిపిస్తుంది జనానికి నిజానికి. ★

# సినిమా వార్తలు

భారతీ ప్రొడక్షన్‌వారి "బభ్రువాహన" చిత్రానికి విజయ పిక్చర్స్ అధిపతి శ్రీ బి. నాగిరెడ్డి వాహినీలో ఏప్రిల్ 7 న ప్రారంభోత్సవం చేశారు. శ్రీయుతులు వేదాంతం రాఘవయ్య, నాగయ్య, సి. ఎస్. ఆర్. ఎ. నాగేశ్వరరావు, ఆర్. నాగేశ్వరరావు, ఘంటసాల వెంకటేశ్వరరావు ప్రభృతులు వచ్చారు.

శ్రీ ఎన్. టి. రామారావు క్లాప్ కొట్టారు. తొలి 'షాట్' లో శ్రీమతి రాజసులోచన నృత్యాన్ని చిత్రించారు. శ్రీ సముద్రాల రాఘవాచార్య ఈ చిత్రానికి దర్శకత్వం నిర్వహిస్తున్నారు. నిర్మాతలు శ్రీ కేసర్ల రామసామయ్యశెట్టి, ఎ. వి. రమణమూర్తి.

* * *

అశ్వరాజ్ పిక్చర్స వారి "వినాయక చవితి" విడుదలకు సిద్ధంకావస్తున్నది. రచయిత సముద్రాల రాఘవాచారి, ఈచిత్రానికి దర్శకత్వం నిర్వహించారు. జమున, గుమ్మడి వెంకటేశ్వరరావు మొదలగువారు పాల్గొన్నారు.

* * *

నిర్మాణం పూర్తికావస్తున్న మరో చిత్రం అశోక పిక్చర్స వారి "భూలోకరంభ". ఇది తెలుగు తమిళ భాషలలో తయారవుతోంది. అంజలి ఇందులో ముఖ్యభూమిక నిర్వహిస్తున్నది. ఇతరనటులు చలం, రేలంగి, ఆర్. నాగేశ్వరరావు. రచన సముద్రాల జూనియర్. దర్శకుడు ఎస్. బాలచందర్.

* * *

విఠల్ ప్రొడక్షన్స్‌వారి "వద్దంటే పెళ్ళి" వాహినీలో చురుకుగా తయారవుతోంది. మే నెలలో విడుదలకై దర్శకుడు విఠలాచార్య సన్నాహాలు చేస్తున్నారు. కృష్ణకుమారి, గిరిజ, అమర్‌నాథ్, రాజనాల, సి. ఎస్. ఆర్, రమణారెడ్డి పాల్గొంటున్నారు.

## 'తోడికోడళ్లు'

ఆంధ్రలో విజయవంతంగా సాగుతున్న అన్నపూర్ణావారి సాంఘిక చిత్రం "తోడికోడళ్లు" కథను, మాటలూ పాటలతో జోడించి చక్కని పుస్తకంగా వేశారు. ఆత్రేయ, ఆదుర్తి సుబ్బారావు, డి. మధుసూధనరావూ, శరత్ కథ "నిష్కృతి"ఆధారంగా ఈ చిత్రకథను వ్రాయడం విదితమే. ఇపుడు రామ్‌చంద్ దాన్ని కొంత సంగ్రహంగా రూపొందించి ఇందులో పొందుపరచారు. "తోడికోడళ్లు" చిత్రంలోని ఛాయాచిత్రాలు చాలా వేశారు.

వెల 6 అణాలు (37 నయా పైసలు). ప్రచురణ డి. మధుసూధనరావు. అన్నపూర్ణాపిక్చర్స ప్రైవేట్ లిమిటెడ్ మద్రాసు. ప్రతులకు విశాలాంధ్ర ప్రచురణాలయం పేరిట, బకింగ్‌హాంపేట, విజయవాడ-2 కు వ్రాయాలి.

## కళాకారులకు పరిపత్సన్మానం

సంగీతనాటక అకాడమీవారు 1956 వ సంవత్సరానికి ఈక్రింది కళాకారులను సత్కరించారు. చలనచిత్ర దర్శకుడు శ్రీ దేవకీ బోస్; రచయిత శ్రీ జి. డి.మద్గూల్‌కర్.

భరతనాట్యం: శ్రీమతి రుక్మిణీ అరుండేల్ కథక్ శ్రీ లచ్చు మహరాజ్.

కర్ణాటక సంగీతం శ్రీ ముసిరి సుబ్రహ్మణ్య అయ్యర్, వయొలిన్- శ్రీ మైసూర్ చౌడయ్య. హిందుస్థానీ సంగీతం శ్రీమతి రసూలన్ బాయ్.

రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ మార్చి 31 న వీరికి సమ్మానపత్రాలిచ్చి గౌరవించారు. శ్రీ దేవకీబోస అస్వస్థులుగా ఉన్నందువల్ల ఆరోజు ఉత్సవంలో పాల్గొనలేకపోయారు.

## హాస్య నటుడు గోప్ మృతి

150 పైచిలుకు చిత్రాలలో హాస్యభూమికలు నిర్వహించి, పేరు, ప్రేక్షకుల అభిమానమూ గడించుకొన్న హిందీనటుడు గోప్ గతవారం గుండెజబ్బువల్ల హఠాన్మరణం చెందారు. లైఫ్ అండ్ ఆర్ట్స వారి "తీన్‌సీ గర్ల్స్" అనే చిత్రంలో నటిస్తూ ఉండగా మరణం సంభవించింది. గోప్ వయసు 44 సంవత్సరాలు. ★




(10-వ పేజీ తరువాయి)

"ఇదిగో ఆ అంగుళీయకం! నీవు చేసినదంతా నాకు బోధపడిపోయింది. ఇప్పటికైనా నిజం చెప్పు!"

ధన్వముఖంలో కత్తివాటు వేసినా నెత్తురు చుక్క లేదు! అతడు మరి చేసేదేమీ లేక తానన్నమాటేమళ్లీ వంతపాడాడు. దానితో మంత్రి అగ్గిలో వేసిన గుగ్గిలంలా మండిపడ్డాడు:

"ధన్వా! నీవీ అంగుళీయకం అనంగ లేఖకు బహూకరించావు! అమ్మవారి వ్రేలినున్న ఆ అంగుళీయకం అనారకాంత వ్రేలి కలంకరించావు! ఇది అంతా ఋజువయిపోయింది. ఇప్పటికయినా నిజం చెప్పు! నాయనా! నా మాట విని నీ ప్రాణాలు సంరక్షించుకో!"

ధన్వ తల వంచుకొన్నాడు. అంతేగాని అవుననిగాని కాదనిగాని సమాధానం చెప్పలేదు. ఆ మౌనంతో మంత్రి తన ఆగ్రహానికి కట్టుకొన్న అడ్డుకట్ట ఒక్కమారుగా కూలిపోయింది:



ఆర్. కె. ఫిలింస్ వారి "అబ్ దిల్లీ దూర్ నహీఁ" లో సులోచన, మోతీలాల్.

"ఛీ నీచుడా! నీవిక నా భవంతిలో ఉండ దానికి తగవు! వెంటనే ఇక్కడనుంచి వెళ్ళిపో! ఈ నాటినించీ నీకు, నాకు ఋణం తీరిపోయింది. ఇక నీవు నాకు కుమారుడవు కావు! నేను నీకు తండ్రిని కాను. పో! నా ఇంటిలోనించి లేచిపో!"

అయినా ధన్వ ఇంకా అలాగే నిలబడ్డాడు. మంత్రి మళ్ళీ విరుచుకుపడ్డాడు:

"ఏం! ఎన్ని సారులు చెప్పినా కదలవేం! పో! నాఇంట్లోనించి లేచిపో! లేకపోతే నేనే నిన్ను మెడపట్టుకుని గెంటివేస్తాను! తెలిసిందా! పో! ఇక నా ఎదుట నిలబడకు!"

మంత్రి లేవబోయాడుగాని అతనికి కొంచెం సమీపంలో నిలబడిన మంత్రి పరిచారకుడు ధన్వను నెమ్మదిగా వీధిలోకి గెంటివేశాడు.

అంతలో ఆ గందరగోళం అంతా విన్న జయమంగళ హడిలిపోతూ అక్కడికి పరిగెత్తుకు వచ్చింది. ఒక్క క్షణంలో ఏదో విడ్డూరం జరిగిందని గ్రహించుకుంది:

"ఏమి జరిగింది! ఏమిటిదంతా!"

ఎంతో ఆత్రంగా ప్రశ్నించింది. మంత్రి ఒక్క దీర్ఘనిశ్వాసం విడిచిపెట్టాడు:

"ఇదిగో! నీ కుమారుడు చేసిన ఘనకార్యమిదిగో!"

ఆ అంగుళీకం ఆమెకు చూపించి జరిగినదంతా సంగ్రహంగా ఆమెకు తెలియజేశాడు. జయమంగళ అతని పాదాలమీద పడి ఆ తప్పిదమెలాగైనా మన్నించి ధన్వంతరిని ఇంట్లో ఉండనీయవలసిందని పరిపరి విధాల ప్రార్థించింది. మంత్రి నెమ్మదిగా ఆమెనోదార్చడానికి ప్రయత్నించాడు:

"ధన్వ నెలాగైనా సంరక్షించాలనే నేననేకవిధాల బతిమాలుకున్నాను. కాని వాడు నామాట వినిపించుకోలేదు! నేనేమి చెయ్యగలను! ఈ క్షణంనించీ ఇక వాడు నా కుమారుడు కాడు. అంతే!"

అయినా జయమంగళ అతని పాదాలు విడిచిపెట్టలేదు! అల్లాగే కాళ్ళమీదపడి పరిపరివిధాల బతిమాలుకుంది. కాని మంత్రి చలించలేదు:

"ఇక ఈ క్షణంనించీ ధన్వ నాభవంతిలో అడుగు పెట్టడానికి వీల్లేదు! నీవు నీకుమారుణ్ణి విడిచి ఉండలేకపోతే నీవుకూడా వాడితో కలిసి వెళ్ళిపో! అంతేగాని వాడిక యీ భవంతిలో అడుగుపెట్టడానికి వీలులేదు! అంతే!"

మంత్రి వెంటనే ఆమె పాదాలపట్టు విదిలించుకొని ఒక్క అంగలో అక్కడినించి వెళ్ళిపోయాడు. జయమంగళ అక్కడే కూలబడిపోయింది. —సశేషం.

# వేలంపాట

(12-వ పేజీ తరువాయి)

"దేఖో సాబ్! మళ్ళీ ధర పలకలేదు కనుక అందరికీ కమీషన్ ఇస్తున్నాను" అంటూ మా అందరికీ తలొక పెన్సిలూ ఇచ్చాడు. పెన్సిలు బాగానేవుంది. ఎంత లేదన్నా బేడకు తక్కువ వుండదు.

మళ్ళీ ఏదో సెక్లాసు బయటకు తీశాడు. "చూడండిసార్! ఈ సెక్లాసు బజారులో కొంటే పది రూపాయలకు తక్కువవుండదు. రోల్డుగోల్డు" అంటున్నాడు.

ఎవరూ అది వినే పరిస్థితిలో లేరు. అంతా తమకు వూరికే కమీషన్ క్రింద వచ్చిన సామానులు చూసుకుంటున్నారు.

పాట మొదలుపెట్టారు. సర్దార్జీ అందుకున్నాడు "ఈసారి కమీషన్ క్రింద ఈ కత్తెరలు యిస్తాన్" అన్నాడు అవి బయటకు తీసి చూపిస్తూ. చూడటానికి కత్తిర బాగానే వుంది. ఫరవాలేదు! మళ్ళీ అందరమూ, సంభావన పుచ్చుకున్నట్లు తలొక కత్తెర పుచ్చుకోవచ్చును, అనుకున్నాము.

పాట బాగా సాగింది. నేను వూరుకోలేక మూడుంపావలా అన్నాను. ఎవరో మూడూ అరణాలన్నారు. చివరికి మూడూ పద్దానుగు అణాలదగ్గర ఆగిపోయింది. పెద వది! రెండున్నర దగ్గరనుంచి లాక్కొచ్చాడు. ఎంత పాడినా ధర పలకడంలేదు.

చివరికి సర్దార్జీకి విసుగుపుట్టి పాట ఆపేశాడు.

"చూడండి! ఈ వస్తువు 8 రూ. 14 అణాలకు పాడారు. సరే! ఈ వస్తువు ఇచ్చేస్తాను. అందరూ డబ్బు చూపించండి!" అన్నాడు.

చచ్చాముర్రా బాబూ! అనుకున్నాము. అయినా ధైర్యంచేసి డబ్బు చూపించాను. అందరిదగ్గరా సర్దార్జీ డబ్బు వసూలుచేశాడు. నేను చాలా బింకంగా వున్నాను. ఎలాగూ అందరికంటే ఎక్కువ పాడిన ఆసామికి సెక్లాసు యిచ్చేస్తాడు అనుకున్నాను.

కానీ అలా జరుగలేదు. సర్దార్జీ మా అందరీవంకా వొకసారి చూశి "చూడండీ! మీరంతా నాకు డబ్బు యిచ్చేశారు. అందరికీ తలొక సెక్లాసు యిచ్చేస్తాను" అంటూ అందరికీ అవి పంచిపెట్టాడు.

సర్దార్జీ రైలుదిగి వెళ్లిపోయాడు. ఇంకేముంది! రైలులో లబాయిలూ, దిబాయిలూ! అది ఇత్తడి సెక్లాసుట! ఎవరూ చూసుకోలేదు. రూపాయకుకూడా అది దండుగేనట! గంటసేపుదాకా అందరమూ దాని గురించే మాట్లాడుతూ కూర్చున్నాము. ★

# అపరబుద్ధి

(34-వ పేజీ తరువాయి)

"నేను వింటున్నాను. సందేహ మక్కర లేదు, చెప్పు" అన్నాడు పాండ్య.

"డాక్టరు చంద్రశేఖర్‌ను నేనే హత్య చేశాను."

*     *     *

పాండ్య నిశ్చేష్టుడై నావైపు చూస్తున్నాడు. అతను తెలుసుకోవాలనుకుంటున్న ప్రతి విషయం చెప్పాను. కమలాక్షి విషయం కూడా ఆయనతో చెప్పాను. పదినిమిషాల్లో అన్ని విషయాలు చెప్పగలిగానంటే విచిత్రంగానే వుండవచ్చు. పాండ్య వెళ్ళటానికి లేచాడు.

"చూడండి," అని ఆయనను పిలిచాను.

"నాకు పని వుంది."

"పోలీసులు కమలాక్షిని కొట్టకుండా చూడండి."

"నేనుత్వరగావెళ్లాలి. తరువాత మళ్లీ వస్తాను."

"పాండ్య! మీకు కావలసిన రహస్యం విప్పి చెప్పాను. ఆమెను పోలీసులు కొట్టకుండా కాపాడాలి. ఆమెను కొడితే నిన్ను హత్య చేస్తాను! ఈ రహస్యం మీకు చెప్పటానికి ఒక్కటే కారణం. ఆమెను దెబ్బలు కొట్టకూడదని నా కోరిక! హృదయపూర్వకంగా మీరు నాకు అభయం ఇవ్వాలి."

పాండ్యవెళ్లాడు. ఈవిషయం పాండ్యతో చెప్పటంతో నా హృదయానికి కొంత శాంతి కలిగింది. నేను చేసిన పనికి సంతృప్తి చెందాను. కొంత కాలంనుంచి ఈ రహస్యం నా హృదయంలోనే దాగివుంది. నేను నిద్రించినపుడు, కలలు వచ్చినపుడు, శ్వాస పీల్చుకుంటున్నపుడుకూడా ఈ రహస్యం నా హృదయంలోనే దాగి వుంది. ఇంత వరకూ నా హృదయానికి శాంతి లేకపోయింది. నా మనస్సు కమలాక్షిమీదే లగ్నమైంది. చివరికి నేను ఎవరో ఆమె తెలుసుకున్నపుడు నాగురించి ఏమనుకుంటుందో కదా అనుకున్నాను.

మూడు గంటలకు ఆఫీసు నౌకరు మధ్యాహ్నం పత్రిక తీసుకువచ్చాడు. నేను పాండ్యతో చెప్పిన రహస్యాలు పత్రికలో వెల్లడి కాలేదు. కాని డాక్టరు చంద్రశేఖర్ మొదటి భార్య మరణించినది మొదలు నడిచిన చరిత్రను సేకరించటం దగ్గరనుంచి, నన్ను రివాల్వరుతో కాల్చిన సంఘటనవరకూ పోలీసులు తీవ్రమైన పరిశోధనలు చేస్తున్నారు. దినపత్రికలో "మహిళా లోకం" నిర్వహిస్తున్న సంపాదకురాలు కోమలంతో పరిచయం చేసుకుని, ఆమె జీవితగాథను తెలుసుకుని "మృత్యుగృహం" అనే శీర్షిక క్రింద ప్రతిరోజూ ఆ పత్రికలో ఒక కథ వ్రాస్తూంది. —ఇంకా వుంది]

[27 వ పేజీ తరువాయి]

"మొదటలా అనుకున్నాను. గోపాలం సిగరెట్ తాగుతాడుగా, సిగరెట్ పీక లేమయినా ఇక్కడున్నాయేమోనని చూచాను. లేవు. కిటికీ దాకా అడుగుజాడలు కన్పించాయ్. అంటే గోపాలం సహాయంతో ఎవరో అటువేపునుంచి పెన్ను పట్టుకెళ్లారన్నమాట!" దాసు డిటెక్టివ్ వాలీ ఫోజు పెట్టి అక్కడుండే కుర్చీలో కూలబడ్డాడు.

"ఈ అడుగుజాడ లేమిటో, వెధవగొడవ నాకర్థం కావటం లేదురా దాసూ" రామం అమాయకంగా అన్నాడు.

"నీకర్థం కాదులే, నే చెప్పినట్టు చెయ్యి, నీ పెన్ను నీకు వస్తుంది" దాసు రామం దగ్గరగా వచ్చి నిలబడి చెవిలో ఏదో చెప్పాడు.

ఇష్టం లేకున్నా రామం తలూపాడు.

"అయితే, సరిగ్గా 4½ గంటలకు ఊరి బయటి తాటి చెట్లదగ్గరికి...సరేనా? అయినా? అయినా ఓ పేపరూ, పెన్సిలూ ఇలాతే, ఆ అడుగు ఔట్ లైన్ గీచుకుంటాను" కాస్సేపటికల్లా కాగితం మడిచి జేబులో పెట్టుకుంటూ దాసు "మర్చిపోకు"అంటూ సంతోషంగా బయటికి వచ్చాడు.

* * *

సాయంత్రం మూడున్నర కల్లా రెడీ అయినాడు దాసు. పేంటూ, షర్టు టకప్ చేసుకున్నాడు. పేంటు జేబులో తనీమధ్యనే పరిశోధనలకుగాను కొన్న ఆటుగుండ్ల తుపాకి పెట్టుకున్నాడు. షర్టు జేబులో తను రామం ఇంట్లో గీచుకున్న కాలి గుర్తు బొమ్మ కాగితం పెట్టుకున్నాడు. ఇక బయలేరాడు. దోవలో అంతా మనస్సులో రిహార్సు చేసుకున్నాడు. గోపాలం కనపడగానే తానెలా నిలోచ్చవాల్సిందీ, ఆ తర్వాత ప్రశ్నలు ఎలా వెయ్యాల్సిందీ, అటుపై సకారణంగా నేరాన్ని రుజువు చెయ్యటం, ఆ తర్వాత వాడికి బుద్ధిచెప్పటం, తను గర్వంగా రామం వేపు చూడ్డం...తన ఖ్యాతి...

తాటిచెట్లదగ్గరికి చేరుకున్నాడు దాసు.

4-15 నిముషాలయింది. కొంపదీసి రామం మర్చిపోడుగదా అని భయపడ్డాడు. అబ్బే! అలా చెయ్యడులే అని తనకు తానే మనస్సు సర్దుకున్నాడు.

దూరాన రామం, గోపాలం కన్పించారు.

దాసు తన్ను తానోకమారు చూచుకుని గంభీరంగా నిల్చున్నాడు. రామం, గోపాలంవచ్చారు.

రామం భయం భయంగా దూరంగా నిల్చున్నాడు. గోపాలంతో తగూ లాడ్డం ఇష్టం లేక.

దాసు సీరియస్ గా అన్నాడు:"గోపాలం! ఇలా రా!"

గోపాలం ఆశ్చర్యంగా దగ్గరికి వచ్చాడు.

"ఇదిగో ఈ పేపరుమీది ఔట్ లైన్‌మీద అడుగుపెట్టు"ఆ కాగితం కిందపెట్టాడుదాసు.

"ఎందుకు దాసూ?" అర్థంకాక అడిగాడు గోపాలం.

"నీ కెందుకు చెప్పినట్టు చెయ్యి, లేకపోతే ప్రమాదం" ఓ డిటెక్టివ్ కనబర్చవలసిన కర్కశత్వాన్ని ధ్వనింపచేశానని మనసులో సంతోషపడ్డాడు దాసు.

మొండిగా గోపాలం కదల్లేదు.

దాసుకు ఇక అనుమానం పూర్తిగా దృఢపడింది.

"చూశావా రామం! నే చెప్పలేదూ. సరేకానీ ఎలా చెప్పకపోతావో నిజం చూస్తాను. నీ చేతనే చెప్పిస్తా" దాసు ఘట్టిగా అరిచాడు. మరుక్షణం అతని పేంటు జేబులోని తుపాకి గోపాలం గుండెమీదుంది.

రామం కొయ్యబారిపోయాడు.

గోపాలం గజ గజ లాడిపోయాడు.

దాసు పకపక నవ్వాడు "నిజం చెప్పు గోపాలం! లేకపోతే లాభం లేదు. నిన్నటి పెన్ను సంగతి చెప్పకపోతే ఇది పేల్తుంది."

గోపాలం గావు కేక పెట్టాడు.

హఠాత్తుగా దాసు చేతులు ఎవరో పట్టుకున్నారు.

ఆశ్చర్యంగా వెనక్కుచూచి నీరు గారిపోయాడు దాసు.

"నడు స్టేషన్‌కు" ఘట్టిగా అన్నారు పోలీసు లిద్దరూ; అందులో ఒకడన్నాడు "ఇందాకట్నుంచీ కనిపెడ్తున్నాం నిన్ను. మేము లేకపోతే అన్యాయంగా వాళ్లిద్దరి ప్రాణాలు తీసేవాడివి కాబోలు పదండి అబ్బాయిలూ! స్టేషన్లో రిపోర్టు ఇద్దురుగాని." దాసును జెబ్బలు పట్టుకులాగారు.

అప్రయత్నంగా రామం అన్నాడు.

"ఇదంతా నిజంకాదండీ...డ్రామా రిహార్సల్సు."

పోలీసులిద్దరూ ఆగారు.

"నిజంగానా?"

"ఆ! "దాసుగొంతు ఎండిపోయి ధ్వనించింది.

"అయ్యో పొరపాటుపడ్డామన్నమాట. సారీ! ఇలాటి ప్రదేశాల్లో వద్దబ్బాయి రిహార్సల్సు...ఎవరైనా అనుమానపడ్తారు...వెళ్లండి..." రెండవ పోలీసు అన్నాడు దాసు చేతిని వదిలిపెడ్తూ.

ముగ్గురూ కదిలారు. ఛీఛీ నాశనంచేశారు పట్టును. ఆ దెబ్బలో గోపాలంచేత నిజం చెప్పించేవాడు తాను. ఇప్పుడిక చిక్కడు గోపాలం. అంతా తెల్సుకున్నాడు... అయినా ప్రథమప్రయత్నం కాస్తాపాడయిపోయిందిగదా! తీరా సమస్య పరిష్కరించే సమయంలో సైంధవుడిలా అడ్డుపడ్డారు. పోలీసులు. ఛీ. ఛీ... దాసు మెదడు ఆలోచనతో బరువెక్కింది.

అయినా ఇంతదూరం ఎందుకురమ్మంది? పైగా గోపాలందగ్గర పెన్ ఇప్పిస్తాను నీకు అనిచెప్పి పిస్తోలు ఎందుకు తెచ్చాడు దాసు? రామంతల్లో ఇదితప్ప ఇంకేమీ లేదు.

ఇంతాచేసి పెన్ ఏమిటి? ఆ పెన్సిల్‌తో గీచిన బొమ్మఏమిటి ఆపిస్తోలు చూపించి ఎందుకు బెదిరించాడు నన్ను? అని ఆలోచన్లో మునిగి తేలి నడుస్తున్నాడు గోపాలం.

ముగ్గురూ మౌనంగా నడుస్తున్నారు.

చింతతోపుదగ్గిరికి వచ్చారు. చింతచెట్లగుండా నడుస్తున్నారు. ముగ్గురూ మాట్లాడ్డం లేదు. హఠాత్తుగా ముందుపోతున్న దాసు "అబ్బా" అని తలమీద చెయ్యిపెట్టుకు అరిచాడు. మిగతా ఇద్దరూ దాసు వేపు చూచారు భయపడ్తూ...హఠాత్తుగా కిందికి చూచిన రామం దాసు కాళ్ళదగ్గరి తన పేనా చూచి ఘట్టిగా అరిచాడు "అరె...నా పేనా!"

"ఏమిటీ?" దెబ్బను మరిచిపోయి దాసు కూడా ఆశ్చర్యంగా చూచాడు నిజమే! ఏమీ అర్థంకాక గోపాలం వాళ్లిద్దరి మొహాలూ చూస్తున్నాడు. "పేనా చివర ఇలా కొరికేసుందేం?"

"ఎలావచ్చిందీ?" రామం కళ్లుపెద్దవి చేస్తూ అన్నాడు.

"నా తలమీద పడిందిరా!" దాసు తల పైకెత్తి ఆశ్చర్యంగా చూస్తూ అన్నాడు. ముగ్గురూ తలపైకెత్తారు.

చింతచెట్టు చివరికొమ్మమీదినుంచి జారిపోయిన వస్తువుకోసం పండ్లికిలిస్తూ వాళ్ళ వేపు చూస్తున్న మర్కటరాజం ఒకటి వాళ్ళ కంటపడ్డది. 



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.

ఆంధ్ర ప్రదేశ్ అంతటా
ఏప్రిల్ 19 తేదీన
విడుదల!

రాజశ్రీ ఫిలింస్ వారి

# దాంపత్యం

జి. వరలక్ష్మి... రేలంగి... గుమ్మడి... విజయకుమార్... నాగిణి
లక్ష్మీరాజ్యం... విద్యావతి... పెరుమాళ్లు... డా|| గోవిందరాజుల... బాలి

సంగీతం... కృష్ణవేణి + దర్శకత్వం... ఇ. అప్పారావు, బి.ఏ. + నిర్మాణపర్యవేక్షణ... ప్రసాద్, బి.ఏ.

డిస్ట్రిబ్యూటర్స్ : ఆంధ్ర అండ్ నైజాం శ్రీ నేషనల్ ఆర్టు పిక్చర్స్. సీడెడ్ : భాస్కర్ పిక్చర్స్.